శ్రీకృష్ణవిలాససభ తెనుగుకండక్టర్లు

చంద్రహాస అను శృంగారనాటకము

మదరాసు, 1924

Record no. 465

Śrīkṛṣṇavilāsasabha

Tenugukaṇḍakṭarlu

Candrahāsa anu

śṛṅgāranāṭakamu

Madarāsu, 1924

Record no. 465

## Bibliographic Record Target

శ్రీకృష్ణవిలాససభ తెనుగుకండక్టర్లు.

చంద్రహాస అను శృంగారనాటకము / ఈ గ్రంథము శ్రీకృష్ణవిలాససభ తెనుగుకండక్టర్లచే రచియింపఁబడినది. - మదరాసు : అమెరికెన్ డైమెన్ ముద్రాక్షరశాల, 1924.

6, 120 p. ;19 cm.

Record no. 465

Śrīkṛṣṇavilāsasabha Tenugukaṇḍakṭarlu.

Candrahāsa anu śṛṅgāranāṭakamu / Ī granthamu Śrīkṛṣṇavilāsasabha Tenugukaṇḍakṭarlacē raciyimpam̐baḍinadi. - Madarāsu : Ameriken Ḍaimen Mudrākṣaraśāla, 1924.

6, 120 p. ;19 cm.

Record no. 465

శ్రీ స్త.

# చంద్రహాస

అను

శృంగార నాటకము.



ఈ గ్రంథము

శ్రీకృష్ణవిలాససభ తెనుగుకండక్టర్లచే

రచియింపఁబడి,



వే. కృష్ణస్వామి మొదలియారివారి

స్వకీయ

అమెరికన్ డైమండ్ ముద్రాక్షరశాలయందు

ముద్రింపించి ప్రకటింపఁబడియె.

1924



19 సంవత్సరం నెల తేదీన No. N 762 ది వేటపాలెం

కో-ఆపరేటివు బ్యాంకి లిమిటెడ్ శెక్రటరీగారికి,

బ్యాంకి G. L. No.

వ్రాసియిచ్చిన Chit loan రసీదు.

ఈ బ్యాంకిలో నెం రు గల రూ ల చిట్‌ఫండుకు నేను చందాదారుడనై యున్నాను. ఈచీటియొక్క వాయిదా పాట తేదీన జరుపబడి రూ లకు నా పేర కొట్టివేయబడియున్నది. ఈ పాట మొత్తం రూ అక్షరాలా

నాకు యీరోజున యిచ్చినారు గనుక ముట్టినది. యీ చీటీయొక్క ముందువాయిదాలు సక్రమముగ చెల్లించుటకు నేనున్నూ, ఈ బ్యాంకి సభ్యుడగు G. L. No. మేముభయులము జాయింటుగా బాధ్యులమై యుండుటకు అంగీకరించి వ్రాయించియివ్వడమైనది.

సాక్షులు. చీటీ పాటదారు సంతకం.

దస్తూరి. జామీనా దారు సంతకం.

వెస్టువార్డు అండు కంపెనియందు హాజరుగానుండు

# వేదాంత గ్రంథములు.

**హఠయోగప్రదీపిక:**— వేదాంతవేద్యము (ఇందు 128 యోగాసనరూప పటములు గలది) యోగాభ్యాసకులకు యోగ్యము. తన్మోక్షమును వెదజల్లును. 2 8 0

**యోగవిద్య:**— ఇందు 32 యోగాసన రూపపటములతో సమర్చబడినది, సులభోపాయములగు యోగములను తెలియంజేయును. 0 4 0

**శ్రీ సీతారామహృదయంబను, పదునారురాజులకథలు:**— ఇందు శ్రీరాములు ఆంజనేయులకు తద్బోధను యొనకజేసి వేదాంతవేద్యములగు మోక్షప్రదాయకమైన కథలంగల్గినది. 0 12 0

**సచ్చిదానంద బోధామృతమను రాజహంస పరమహంస సంవాదము:**— ఇది పింగళయను వేశ్యకును, ఒకసన్యాసికిని జరిగిన సంవాదము. ఇందు సందేహాస్పదంబులగు నేతి నేతి వాక్యంబులం గోచరించుచు మిక్కిలి శృంగారంబులగు కథలను గాన్పించుచు, మోక్షసన్యాస మెద్దియో వానినిం గుర్తెరిగింపుచు అజ్ఞానంబుల దొలగించు సూచనంగలది. 0 12 0

**వేదాంతసార ప్రశ్నోత్తర రత్నావళియను గురుశిష్యసంవాదము:**— ఇందు సర్వసారోపనిషత్తు, నిరాలంబోపనిషత్తు, అమృతబిందూపనిషత్తు, మైత్రేయోపనిషత్తు అనెడి ఈ నాల్గు ఉపనిషత్తులన్ను మొదటినుండి కడవరకు సంపూర్ణ తాత్పర్యమును గురుశిష్య ప్రశ్నలం విభాగించుచు నచ్చటచ్చట నుపమాన నుపమేయ వాక్యంబులం అవలంబించి సులభోపాయంబగునది. 1 0 0

**శ్రీకృష్ణామృత బోధయను పండ్రెండురాజులకథలు:**— ఇందు శ్రీకృష్ణుడు తన బావమరిదియగు నర్జునునకు వేదాంత వేద్యసూక్ష్మంబగు ద్వాదశరాజులయొక్క అనుభవనీయంబును యెరుకలేని మార్గమును అచ్చటచ్చట వెదజల్లుచు పుట్టుచావుల నిరసించుచు ప్రతిలేని బోధలుం గలవి. 0 12 0



**దృగ్దృశ్య వివేకము:**—(దృక్కు, దృశ్యము, వివేకము) అను వేదాంతవేద్యంబును తాత్పర్యసహితముగా వేదశ్రుతులం జూపును. ఇది శ్రీవిద్యారణ్యస్వామి విరచిత శ్లోకములోనిది. వేదాంతరహస్యముల మిక్కిలి విశదముగా జెప్పంబడియున్నది. 0 8 0

**బ్రహ్మజ్ఞాన చింతామణియను, సుగుణాకర మహారాజు కథ:**— ఇందు మనస్సన్యాసమును ముఖ్యమని జెప్పడమేగాక తత్కాలమున భార్యా బిడ్డలను వదలి మనోవికారమై సంసార బంధములను విశదీకరించక కాషాయ వస్త్రములను ధరించి బాహ్యసన్యాసమే సుఖమని గుర్తెరుగు సన్యాసుల వినోదములను విశదీకరించును. 0 8 0

**పరమాత్మలక్షణబోధిని:**— (పద్యకావ్యము, టీకా తాత్పర్యము.) ఇందు గురుశిష్యసంవాదముగా తెలుసుకొనునట్టి లక్ష్యలక్షణంబులను 108 పద్యములతో వివరమై సత్యజ్ఞానానందాది గుణాగుణంబును పరబ్రహ్మంబునకు గలవని వక్కాణించుచున్నది. 0 8 0

**ఉపనిషత్సారరత్నావళి యను శ్రీరామచంద్ర హనుమంత సంవాదము:**— ఇందు 188 ఉపనిషత్తులగు సారములున్ను మరి ముఖ్యములగు దశోపనిషత్తుల యొక్క విశేష తాత్పర్యములున్ను, సారాంశముగా బోధించును. 0 8 0

**శుకబ్రహ్మకైవల్యము అను శ్రీశుకమహర్షి చరిత్రము:**— ఇందు శ్రీశుకమహాఋషికిన్ని రంభకున్ను జరిగిన సంవాద రహస్యముపరమపవిత్రమైనది, బహురుచింపును, సొంపును, సూచనను, కలిగించునది. స్త్రీరూపములగు మాయను నిరాకరించు చమత్కారములం గలది. మరియు నారాయణోపనిషత్తు, ఆత్మోపనిషత్తు నందుగల విషయములను తాత్పర్యముతో జనకచక్రవర్తి, తన భటులతో నాజ్ఞాపించిన సంవాదములనున్ను తేటతెల్లంబుగ సూచించుచున్నది. 0 12 0

"చంద్రహాస" యను నొకమహారాజు చరితంబును హృద్యానవద్యంబగు, గద్యపద్యయుత నాటకంబుగ సులభశైలిని విరచించినాఁడ గనుక తేటయాటలచే నొప్పు నీనాటకము, వచ్చిరాని మాతృస్తకపాయులగు బాలురమాటలట్లు పండితులగు ప్రౌఢ పామరులకు చవిపుట్టించకమానదు.

కాలానుసారంబుగ నవరస భరితంబగు నీనాటకమురసికశిఖామణులకామోదమేనురంబాపాదించుటంబట్టి దీనిని దేశాభిమానముగల ప్రతిమానవుండుగొనిసాంతముగ లోనసారముతయుగ్రహించియిట్టిదేశోపకారములగుగ్రంథములింకనునాంధ్రభాష నలంకరింపజేయు నీగ్రంథకర్తకుబ్రోత్సాహముగలిగించెదరని కోరుచున్నాను.

మఱియు,నక్కడక్కడలోటుపాటులుండిననుండవచ్చును గుణదోషగ్రహణనిపుణులగు పండితశిఖామణులిందుఁగలదోషములనాకుదెలిపి దీనికిమఱింత నన్నెకలిగింతురుగాకయని నమ్ముచున్నాఁడను.

ఈపొత్తమునచ్చొత్తించుటలోనాకువిశేషముగనైదోడుగావించినకీర్తినీయులగు నామిత్రులకు కృతజ్ఞతతో వందనశతంబొనరించువాఁడ.

ఇట్లు - బుధజనవిధేయుఁడు,

పణిహారం - తిరుమలసంపత్కుమార

శేషాచార్యులు.

ఈనాటకమునవచ్చు ముఖ్య పాత్రలు.

పురుషులు.

కుంతలుఁడు—రాజు, చంపకతండ్రి.

దుష్టబుద్ధి—కుంతలుని మంత్రి, విషయతండ్రి.

చంద్రహాసుఁడు—కథానాయకుఁడు.

మదనుఁడు—దుష్టబుద్ధి కొడుకు.

గాలవుఁడు—కుంతలుని మంత్రి.

కుళిందుఁడు—చంద్రభాసుని పెంపుడుతండ్రి.

నాగశయనం<br>సోమసుందరం<br>కల్యాణము } మదన చంద్రహాసుల స్నేహితులు.

దుస్ససేనుఁడు—తలారి నాయకుఁడు.

నాగన్న<br>వీరన్న } తలారులు

స్త్రీలు.

చంపక—కుంతలుని కూతురు, చంద్రహాసుని రాణి.

విషయ—దుష్టబుద్ధి కూతురు. కథానాయిక.

నర్మద—చెలికత్తె.

శ్రీహయగ్రీవాయనమః.

## విఘ్నేశ్వర ప్రార్థన.

నాటరాగం - ఆదితాళము.

గజముఖవదనా - గాచిరక్షించరా॥ గజ॥
సుజనవినుత - సుందరసుకుమార॥ గజ॥
తారకాసురహర - కారుణ్యామందార॥
నీరజదామోధరా-నిరుపమకృపాకరా॥ గజ॥
మానసాబ్జమునందు-మానుగనిల్పినిను॥
గానము జేతుము - కరుణజూడుముముము॥ గజ॥

## సరస్వతీ ప్రార్థన.

కాపిజిల్లా రాగం - ఆదితాళం తిశ్రజాతి.

వాణినీలవేణి - పల్లవపాణిశోభినీ॥
వీణాగానరంజని - బుధవినుతమానినీ॥
వాణీ-వాణీ-వనజాసనరాణీ—శుకవాణీ బ్రోవావే॥ వాణీ॥
సారసాబ్జలోచనీవిచారమోచనీ-
చారుగాత్రి ధీరస్తోత్రి- స్మేరహాసనా॥ వాణీ॥
రాజహంసగామినీ-బిరాన బ్రోవవే॥
రాజమాన్యకీర్తిదాయి-రమ్యభాషణీ॥ వాణీ॥

శ్రీరామజయమ్.

# చంద్రహాస
అను
# శృంగారనాటకము.



## నాంది

సూత్రధారుడు - నటి - వీరలసంభాషణ.

ఉ॥ శ్రీ నెదఁ జేర్చ్చునంచు నిల - చింతిలుచుండఁగఁ జెంతఁ జేరియా
చానను బుజ్జగించగను - జాలఁగఁ గోపము గొన్న నీలకున్
మానక మ్రొక్కి వేడికొను - మాధవుఁడీ సభనుండువారలన్
జానుగ నెల్ల కాలమును - జల్లసి చూపులఁ జూచు కావుతన్.

నాంద్యంతమున.

సూత్రధారుఁడు:— అతివిస్తారమేల? ఇపుడీరంగము రసికపరులచేనలంకరింపఁబడియున్నది; వీరెల్ల రేక కాలంబునవిచ్చేయుటం జేసి మనస్సున కింతింతనరాని సంతసంబున వాటిల్లె కావున నేనిపుడాలస్యంబు చేయక యొకయపూర్వనాటకంబునాడి వీరలమనంబులఁ బల్లవింపఁ జేసెద; నటినింబిలిచి సంగీతముపక్రమించెద.

(ప్రకాశముగా) నటీ! నీయలంకార ధారణమైన వెనుక నొకసారి యిటురమ్ము.

నటి:— నాథా! యిదోవచ్చుచున్నదాన.

నటి ప్రవేశము.

కరుణారసవరుణాలయ - కమలాసనరామా
కరినాయకసుఖదాయక - గరుడధ్వజశౌరీ
శరణాగతజనరక్షణ - సరసీరుహనేత్రా
సురనాయకమదభంజన - శ్రుతిమస్తకధామా॥

ఆర్యా! నమస్కరోమి - దేవా! యేమియాజ్ఞ?

సూత్ర:— కల్యాణప్రేయసీ! ప్రాణసఖీ యీసభాసదులముఖలక్షణం బుపలక్షింప నీరాకకై కోరుచు నెట్లుగాచియున్నవారో చూడుము. మనమపుడాలస్యముచేయక యొకయపూర్వనాటకంబునాడి యిమ్మహాత్ముల డెందంబుల నానందంబు గ్రమ్మచేయుదము.

నటి:— ప్రియా! సరి; చక్కనిమాట చెప్పితిరి - మందమతులమైన మనమెక్కడ? బృహస్పతిని క్రిందుపఱచు మహాపండితుల హృదయరంజనంబు చేయుటెక్కడ? ఇది మనతరంబె?

సూత్ర:— ప్రాణేశ్వరీ! అట్లుతలంపకుము:



క॥ రసికులుగాని మనుష్యులు
పొసగన్ వీక్షించిమెచ్చి - పొగడుటకన్నన్
రసికులగువారలారసి
పస లేదని తెగడుటెంతో - వాసిగనుండున్॥

నటి:— ప్రాణనాథా! అదిసరేగాని; మీరిపుడాడ నుద్దేశించిన నాటకంబెయ్యది.

సూత్ర:— కాంతా! కలదుకదా? కవికులమిత్రులగు సుబ్బాస్వామి మొదలారిచే ప్రచురింపబడిన చంద్రహాస నాటకము. దాని నిట ప్రదర్శింప నిచ్చగొని యున్నవాఁడ.

నటి:— నాథా! ప్రాచీనకవిపుంగవులచే రచింపబడిన నాటకములెన్నియోయుండ నీనవీననాటకము మీమనస్సున కెటులెక్కగలదు.

సూత్ర:— ప్రియే! కాళిదాసాది కవివరులు నాటకములం జేసియుండలేదా? నీవు వినకయుండవా?

నటి:— నాయకా! అదిసరియేకాని; నన్నిపుడు పిలపించిన సంగతిని మఱచి యెద్దియో యుపన్యసించుచున్నారు. ఈ మహాత్ములు కాలహరణమున కోర్వక త్వరపడుచున్నవారలు.

సూత్ర:— ఓహో! మఱచితి నిన్నుపిలపించిన సంగతిని మఱచి యేదియోవదరుచున్నవాఁడను; కాంతాలలామా! నీవసంతఋతువును వర్ణించు నొకగీతంబుపాడి వీరిమనంబుల రంజిల్లచేయుము.

నటి:—నాథా ! భవదాజ్ఞమేఱకు ;

పల్లవి.

ఈవసంతకాలమెంతో - యింపైయున్నదిచూడ॥ ఈ॥
మావిచిగురులెల్ల - మఱిమఱివికసించె
కోవిలాలుకూయనెంతో - యింపైయున్నదిచూడ॥ ఈ॥

సూత్ర:—ప్రేయసీ! నీచేవర్ణితమైన వసంతర్తు సభాసదుల చంద్రహాసంబుచే వన్నెకెక్కె. నీవుపోయి సమయస్ఫూర్తికై కాచియుండుము:

నటి:— తమయిష్టప్రకారమే - నాథా నమస్కారము.

[నిష్క్రమించును]

సూత్ర:—కాంతాపోయిరమ్ము - నీకుశుభంబగుంగాత.

[నిష్క్రమించును]

---

## ప్రథమాంకము - ప్రథమరంగము.

చంద్రహాసుడు తోడిబాలురు బంతులాడుట.

నాగశయనం:—సోమసుందరం! నీవేలబడికేగక యిటనాటలాడవచ్చితివి; ఒజ్జలుచూచిన నినుదండింపక విడుతురా!

సోమసుందరం:—ఓరీ! పిరికిప్రాడ్వాకా! నేనుపాధ్యాయునకు వెఱచువాడనా? అతనినివంచింపనాకుం దెలియదటరా?

నాగ:—ఎవ్విధంబునవంచింతువో తెలియబలుకుము.

సోమ:—నేనుజెప్పునది సావధానంబుగ వినుము; నాతల్లిదండ్రులు నను విద్యావంతుం జేయవలయునను గంపెడాసతో నయ్యవారిని బడికొయ్యన తోడ్కొనిపొమ్మనిరి; అతండట్టులనెకానిండని బడికిదోడుకొనిపోయి ఓనామాలు దిద్దుకొమ్మని వ్రాసియిచ్చెను; నేను కడుపునొప్పియని పోరుబెట్టితిని; పలకవ్రాయుమన్న బలపములేదని యూరకుందును; అతండునాచర్యలంగనిపెట్టి మహాగ్రుడై తొడలువడిపెట్టి కోదండముగట్టి రెట్టబట్టి చేతులుపట్టుమని పట్టుపట్టున బెత్తముతో కసిదీర గొట్టును.

నాగ:—ఓరీ! నీసామర్థ్యమెంత చిత్రంబుగానున్నదిరా! నీవు నిరక్షరకుక్షివగుదువు.

సోమ.—మిత్రమా! నీవాలింతువేని నాయుక్తుల మఱికొన్నిటి
ని తెలిపెద; అయ్యవారునను:

సీ॥ గద్దించివడిఁదిట్టి - దిగ్గుమంచుఁబ్రేలు
బెట్టింపనచటనే - పెట్టకుందు;
పలుమాఱుఓయని - పల్కుచుందునుగొట్టి
చెప్పినశిలవృత్తిఁ - దప్పకుందు;
నొకటికిసెలవీయ - నుఱికిచీకటిదాక
పసులకాపరులవెం - బడినిఁబోదు;
జననియడుక్కొని - చదువుకోపొమ్మన్న
వినకవేమఱువెక్కి - వెక్కియేడ్తు;
గీ॥ సారెసారెకుఁబలకపై - జముగుపోతు
నెప్పుడును బెద్దపలకపా - క్కెత్తజేతు
బాలరామాయణముపుస్త - కాలుదాతు
వేయసజ్జనకోలలు - విఱచినైతు॥
ఇంక నయ్యవారిగతిఁ దెలిపెదవినుము;

గీ॥ నన్ను బెంగలుపెట్టించు - నాడెయయ్య
వారునిద్రింపగాఁజూచి - చేరియచట
చింతకొమ్మనుపంచుక - సిగనుగట్టి
విడిచియుఱుకుదునయగారు - మిడికికూయ॥

నాగ:—ఓరీ! నీబుద్ధిబుగ్గిగాను.



శ్లో॥ జనితాచోపనీతాచ, యేనవిద్యోపదిశ్యతే।
అన్నదాతా, భయత్రాతా, పంచైతేపితరస్మృతా॥

అనునట్లువిద్యంగఱపిన గురునిటులఁ జేయదగునటరా?

కల్యాణము:—సోమసుందరం! ఇపుడు మనమందఱము వేడుక
గామాటలాడుకొనవలయును. నీకేయేయాటలు తెలియును.

సోమ:—

సీ॥ దోచియుజాబిల్లి - బూచికన్నులగచ్చి
గుడుగుడుగుంజాలు - కుందెనగిరి;
చీకటిమొటికాయ - చింతాకుచుఱుకులు
పులియాటలునుకట్ట - పుట్టచెండ్లు;
దాయాలుసాగటాలు - దాట్రాయచదురంగ
మునుబోటురాళ్ళను - మూతపొడుపు;
వామనగుంటలు - వడిగుప్పిగంతులు
చెఱకులపందెముల్ - చిమ్మరాయి;
గీ॥ గాలిపటములుబొంగరాల్ - గోలిగుండ్లు
చిట్లపొట్లాకాయలుదాగు - చెంచులాట
పల్లటీలాటగుఱ్ఱాల - పందెములును
ఉప్పుటెంకాయలాటలు - కోలియాట॥

మిత్రమా! యింకనెన్నియోయాటలు తెలియును.

## చంద్రహాసప్రవేశము.

చంద్రహాసుఁడు:—మిత్రులారా! నేనుజన్మించినకొన్నిదినంబులకే నాజననీజనకులు శత్రురాజులచేఁ జంపఁబడి, రాజ్యంబును ధనకనకవస్తువాహనంబులును, బంధుమిత్రులెల్లఁ అనుబోఁగొట్టుకొని, నేను పగతుఱచేతంజిక్కిన నపాయంబుఘటించునని మదీయజననికి ప్రియదాసియగు నొకవృద్ధవనిత మక్కునఁబోఁ బెక్కునిక్కట్టులం బొందిచక్కఁగ ననుబోషించుచుండ నాపుణ్యాత్మురాలికిజాడ్యంబుసంభవించి నాదురవస్థదేవత యాపెను వాతబెట్టుకొన, నన్నాదరించువాఁడు లేక యన్నమోరామచంద్రాయని యల్లలాడుచు;నిన్నగరంబున సంచరించుచుండ మీరందఱు నాకుఁబ్రియమిత్రులరై నన్ననవరతము మజ్జనభోజనాదులందృప్తిపఱచి సంరక్షించుచున్నారు. మీరందఱునెంతయు వాత్సల్యంబుచూపి; మీసహోదరునివలెనన్ను బోషించుచుండుట గాంచ నేను పూర్వజన్మంబునందు నొనరించిన పుణ్యవిశేషమే యని యూహించెద.

సోమ:—మిత్రమా! నీకింత పసితనంబుననే యింతకష్టంబుకలిగెనుగా; చింతిల్లకుము.

చంద్ర:—మిత్రమా! చింతించిన నేమిఫలము:

సుకృతం దుష్కృతం చైవ గచ్ఛంతి మనుగచ్ఛతి!

యనునట్టుల ననుభవింపవలసినది యనుభవింపక తీరదుగదా.



సోమ:—మిత్రమా!

శ్లో॥ హరిణాపి హరేణాపి బ్రహ్మణాపి సురైరపి।
లలాట లిఖితా రేఖా పరిమార్ష్టుం నశక్యతే॥

ప్రియా! బ్రహ్మనుదుట వ్రాసిన వ్రాతనుదప్పింప నెవరి నశము.

చంద్ర:—

ఆ-వె॥ సుకృతదుష్కృతములు - సుఖదుఃఖములుమహా
విద్యలబ్ధములును - విభవములును
ఆయువునుశుభంబు - లజుఁడువ్రాసినయట్లు
యనుభవింపుచుండు - రఖిలజనులు.

కావున ఆప్తా! నాకింక నెట్టివిపత్తులు సంభవింప నున్నవో యెవ రెఱుంగుదురు.

సోమ:—నీయట్టి సజ్జనున కెట్టి యిక్కట్టులు వాటిల్లకుండునట్టుల దైవంబు కాపాడును.

చంద్ర:—మిత్రులారా! అదిపోనిండు. నాప్రియమిత్రుండును కరుణాలవాలుండును సజ్జనవిధేయుండును నగు మదనుఁడు ఇచటికి నాటలాడ నింకను రాకుండుటకు గతంబేదియో; అతఁడు ప్రతినిత్యము మనకన్నమునుముందు వచ్చును గదా; అతఁడిట లేనిది నామది గొందలంబందుచున్నది.

## మదనప్రవేశము.

మదనుఁడు:—ఆప్తమిత్రా! చంద్రహాసా! నీ మొగంబునందేదో కొంచెము వ్యసనంబుదోఁచి వ్యాకులుండవగుటకు కారణంబేమి.

చంద్ర:—నాప్రియమిత్రుండవగు నీవిందున లేనందునదే.

మద:—చంద్రహాసా! నీవు నన్నెడబాసి యుండలేవని తెలిసి నే నతిత్వరితమ్ముగ నిందు నేగుదుర, మదీయజనకుండు నన్నొక కార్యార్థమంపె, కావునఁ గొంత యాలస్యమైనది; మిత్రమా! నన్ను మన్నింపుము.

చంద్ర:—సఖా! నీకై నేనెదురుచూచుచుండ నరుదెంచితివి. మిత్రమను నక్షరద్వయము దొరకుటరుదు. కన్నవారి కన్న మిన్నయగుపదార్థము మదినెన్నగా నీకన్న నాకెవ్వరు ఈ ప్రపంచమునందు నిక్కముగా లేరు.

మద:—మిత్రులారా! యింక నాటలాడక మిన్నకుండు టేల; మీరందఱును యోచించి యేదైన నొకయాటను దెల్పుడు.

సోమ:—గాలిపటములు విడుచునాటకు నిష్టముగానున్నది.

మద:—చీ! చీ! ఆయాటవలదు.

బాలురందఱును:—

రాగము - బేహాగ్ - ఏకతాళము.

చలమేల- లీల- లాడుటకేల
జాలముసేయుట - వేళయుఁగాదు
నాడుట- గాలి- పటములనాట
దాయాలాట - సొగటాలాట॥ చల॥



ఆడెదగుడిగుడి - గుంజాలాట
వేట్కగతిరుగుడు - బిళ్ళాలాట
దోసుడుగాయ - వెన్నెలకుప్పలు
గంగెద్దులాటలు - నాడుదమా॥ చల॥
సంతసమిచ్చే - బంతూలాట
పంతము వేసుక - నాడుదమా
అంతరిక్షము - కెగుర వేయుచు
నంతులు వేసుక - నాడుదమా॥ చల॥
ఆటలలోన - నిదియే మేటి
ఆటయుగాన - హితులారా
పోటిచేయుక - నాడుకొనుట
ఒడలికిబలమును - హెచ్చునుగా॥ చల॥

మద:—చంద్రహాసా! వీరలు తెలుపు నాటలయందు నాకు గొంచమేనియు నిష్టంబు లేదు; నీవొక మంచియాటను దెల్పుము?

చంద్ర:—మిత్రులారా! మీరలిపుడు తెలిపిన పలువిధములైన యాట నాడుటచేత మనదేహంబు కడుబడలిక చెంది మనంబున కుత్సాహంబును దేహంబునకు బలము నిచ్చుట దుస్తరము. కావున మనమందఱ మేకీభవించి యేకకాలంబున నాడఁగూడిన చెండ్లయాట నాడుట వలన మనబుద్ధి వికసించి మనకు విశేషమైన యాలోచనాశక్తి నొసంగునని పెద్దలు వక్కాణింతురు. కనుక

నాయభిప్రాయము వెల్లడిచేసితిని; ఇక మీచిత్తాను సారముగా చేయుడు.

మద:—మిత్రమా! అట్టియాటనే యాడుకొందము.

(బంతులాడుదురు)

చంద్ర:—సఖా! బంతియంతరిక్షమున కెగరి చెంతనున్న యీ సదనంబునఁబడినట్లున్నదే. ఇకమనకది యెటులవచ్చును?

హిందూస్థానికాఫి- ఏకతాళము.

ఆ - ప్రియా - పోయె - నయ్యో
యాడు - కొను - బంతి - యెటకో॥ ఆప్రియా॥
స్వాంతమున - చింత - నొంద
నంతరిక్ష - మార్గ - మునను॥ ఆప్రియా॥
ఎన్నాళ్ళుగా - నాడు - బంతి
అన్నరో - యెడ - బాసి - మనలను॥ ఆప్రియా॥

మద:—మిత్రమా! ఆ బంతికై యేల వెతనొందెదవు అట్టి బంతు లనేకములు దొరకవా?

చంద్ర:—అప్పుడా ఆ చెండుతో మన మెన్నిదినంబు లానందంబుతో నాటలాడుకొంటిమి. అట్టి బంతి నీదినంబున నెడబాసితిమి గదా!

మద:—మిత్రమా! ఆచెండు మనల నెడబాసి యెందుల కేగలేదు; అదిగో! కనబడు సభయందుఁ బడినది. తెలుగా మనకు దొరకును; వగవకుము.



చంద్ర:—మదనా! అట్టులయిన అందుల కేగిరయమ్మున జెండునుగొనిరమ్ము. మఱల మనమాడుకొనెదము.

మదన:—

సురటి - రూపకతాళం.

అనుమాన- పడకను- నీ- వందు - యేగు-చంద్రహాసా
చనుము - నాదు - జనకుఁడందు
సభికులతో- గూడి - యుండు॥ అనుమాన॥
చనగ - నేను - జడిసెదను
జనకుని - గాంచా-మిత్రా
కనిన - నన్ను - కోపముగను
కరము - తూరు - నాడా - నేను॥ అనుమాన॥

చంద్రహాసా! నేనందులకుబంతికై యరిగితినేని; మదీయజనకుఁడు నేనువిద్యాపరిశ్రమము చేయకవినోదంబులచే కాలము వ్యర్థపరచు చుండడముగాంచి మిగుల నాగ్రహపడును. కావునమిత్రమా! నాకచటికి బోవుటకు భయ మగుచున్నది. నీవే పోయి తెమ్ము.

చంద్ర:—మదనా! నేనువిదేశీయుఁడను. ఆసదనంబున నుండు వారెవ్వరిని నేనెఱుంగను; కావున! నందులకేగ వెఱగందెద;

మదన:—మిత్రమా! పిఱికివానివలె బంతిని గొనివచ్చుటకునిం తవంతనొందెదవు; ధైర్యంబుగఁబోయి కొనిరమ్ము:

చంద్ర:— కల్యాణి - చాపుతాళం.

ఎపుడుఁ- బోవగ లేదే- యచ్చోటికి
నిపుడెటు- లా- బోదు హా ఎపు॥
స్వాంతము-నందు- సంతాపము- గలిగెను
వింతగ- మేనంత- వణకసాగెను- అయ్యో ఎపుడు॥
దుశ్శకునము - లాయె
దొలగెనా - ధైర్యము
పోవదలచి - నపుడె
పొడజూపె - నివియన్ని ఎపు॥

అచటికిఁబోవఁ బ్రయాణమైనపుడే నామనంబున నాందోళనంబుకలిగి యెడమకన్ను నెడమభుజము నెడతెగకమిక్కుటముగ నదరుచున్నది. అయ్యో! యిట్లదరుట ముందురాబోవుకీళ్ళకు దుశ్శకునంబులని పెద్దలుసచించెదరు. ఆహా! కాళ్ళు తొడబడుచున్నదే; దైవమా! నాకెట్టి కీడుమూడనున్నదో ఏమిచేయుదును.

చ॥ తడబడజొచ్చె గాళ్ళుకను-దప్పినివాతెఱవాడె మోమునన్
ఎడతెగకుండు స్వేదజల- మేర్పడసాగె తనూవిలాసముల్
చెడెమది నెంచరానియొక- చింతయుదో చెడినేమి సేయుదున్
ఇడుములఁబడ్డమానిసికి- నీశ్వరుఁడొక్కఁడెదిక్కు-రక్షయా॥

[అనిసభకు ప్రవేశించును.]



ప్రథమాంకము - ద్వితీయరంగము.

స భా మం ట ప ము.

చంద్ర:—ఈసభామంటపంబు ప్రవేశించునపుడె నామనంబున దురంతసంతాపంబు నాటుకొనెడి దేహమ్మునఁ జెఱుచెమ్మటలుగ్రమ్మెడి మతిభ్రమణంబుకలిగె; ఇట్లగుటకుంగారణంబెయ్యదియో! ఇందుఁదప్పక నాకుఁగీడగును; ఇందులకుసందియంబులేదు; ఎంతయో దూరంబున బాతిపడెనని యెంచియుంటి ఇదో!యంతికంబుననెయున్నది; నేనతిత్వరితగతినరిగి బంతినెత్తికొని నామిత్రునికడకేగెద(అనిరెండడుగులుపెట్టి) ఆహా! యిదేమి; నన్నెవరును జూచియుండరని యనుకొంటిని. ఇచటనెవరోవిప్రోత్తము లాసీనులై యున్నవారు. వారికివందనంబులిడిపోయెద (బ్రాహ్మణులదగ్గరించి) ఆర్యులారా! వందనమిడెద.

విప్రులు:—అష్టయిశ్వర్య సిద్ధిరస్తు; కోటిరాజ్య ప్రాప్తిరస్తు! దీర్ఘాయుష్యమస్తు.

దుష్టబుద్ధి:—విప్రవరులారా! వందనంబులాచరించెద.

విప్రులు:—దేవరవారికి సర్వమంగళములు చేకూరుఁగాత.

దుష్ట:—గురువర్యులారా! మీపరిపూర్ణ కృపాకటాక్షమువలన కొఱతయులేక సుఖంబుననున్నవాఁడ. నాకొకసందియంబు తోచినది. కంతునసంతజయంతుల నోడించు రూపరేఖా

లావణ్యాతిశయంబులచేనొప్పి కాలవశంబున సంభవించినకష్టంబులచే దేహంబుకృశించి యిన్నగరంబున బాలురతోనాటలాడు బంతికై యిందరుగుదెంచిన యీడింభకునకేల యిట్టిమహదాశీర్వచనంబు చేసితిరి. ఈతనియందు నెట్టిమహిమంబునుగంటిరి? (తనలో) ఇదియేమి? క్రొవ్వుబట్టినయీవిప్రులు నాకిట్టియాశీర్వాదంబులజేయక, దరిద్రుడై యుండు నీకుఱ్ఱనికి నిట్టియాశీర్వాదంబులిచ్చిరి. ఇందులకుంగారణంబెద్దియో.

(ప్రకాశముగా)

కమానురాగం - ఏకతాళం.

గొప్పయాశీర్వాదం
మెప్పుగ జేసిన
దిప్పుడె కారణా
చెప్పెడి విప్రులారా॥ గొప్ప॥

విప్రోత్తములారా! ఇబ్బాలుడెవ్వడు? ఇతనికి మీరలిట్టి దీవెనలిచ్చుటకుం గారణంబేమి? దయచేసియానతిండు.

విప్రులు:—

క్షత్రియజాతుడు - సామాన్యుడుగాడు
శాత్రవులజంపిఁ - జగమేలునయ్యావీడు॥ క్షత్రి॥



ఆర్యా! వీనియందు సాముద్రికశాస్త్ర ప్రకారము ఈతడు మహానుభావుడు. ఇతనియందు నుత్తమక్షత్రియ చిహ్నములున్నవి: ఇతడు శీఘ్రకాలంబుననే యీ కుంతలదేశంబున కధిపతి గలడు. ఇది నిక్కంబు.

దుష్టబుద్ధి:—

ఎఱుగుదురా - వీని-నెందుండువాఁడు - వీడు
సుందరమైనయట్టి-సుకుమారగాత్రుడహా॥ గొప్ప॥

విప్రులు:—

ఎవరిబాలుఁడో-యిత - డెఱుగముదేనా-మేము
ఇప్పుడిటకురాగా-నిందుగాంచితిమయ్యా॥ క్షత్రి॥

దుష్ట:— బ్రాహ్మణోత్తములారా! మీరలీతనిం జేరంబిలిచి యీతని వృత్తాంతంబు కనుంగొనుడు.

హిందుస్తాని తోడి - ఆదితాళం.

మనమునకింపౌన - రించెడి-వీడే
ఘనుడగు-నెవ్వరి-తనయుడోచూడరే॥ మన॥
ఇందువదనుడె - సుందరగాత్రుడె
సూరినుతుండో - సుశీలుఁడే
ఇతడువేగ - క్షితేశుడౌ
మతిందలింపగానారరె॥ మన॥

ఆర్యులారయీ - బాలునిమీరు
నారసి తెల్పుఁడు - విశదముగా
ఇతఁడెవ్వారి - సుతుండో హా
నుతింపనో - సుధీమణీ॥ ముః॥

విప్రులు:—బాలకా! నీవే దేశస్థుఁడవు నీపేరెయ్యది? నీ జననీ జనకులం దెల్పుము.

చంద్ర:—ఆర్యవర్యులారా! నాజననీజనకులు నే జన్మించినకొన్ని దినంబులకే మరణంబుచెంద, నన్నుఁబుణ్యశాలినియగు నొకవృద్ధవనిత పెంపగా నింతవాఁడనైతిని నా తలిదండ్రులు నిక్కముగా;

శ్లో॥ మాతాచకమలాదేవీ - పితాదేవోజనార్ధనః।
బాంధవావిష్ణుభక్తాశ్చ - స్వదేశంభువనత్రయం॥

అనునటుల నాకు లోకమాతయగు లక్ష్మీదేవియే తల్లి ఆనాథరక్షకుఁడగు నారాయణుఁడే తండ్రి.

[అని నమస్కరించి నిష్క్రమించెను.]

దుష్ట:—విప్రులారా! ఈబాలుని మృదుమధుర వాక్కులును శౌర్యగాంభీర్యంబులనుగాంచ నిక్కముగనీతఁడు క్షత్రియకులోద్భవుండౌగాని సామాన్యుఁడుగాఁడు ఇతనివక్షంబును నేత్రయుగ్మంబును దిలకింపుఁడు స్వాములారా మీరలు పోయిరండు వందనములు.

[బ్రాహ్మణులు నిష్క్రమింతురు.]



(తెరలో.)

ఔరా! యీకుఱ్ఱనిసంగతి విననప్పటినుండి నామనంబునదురంత సంతాపంబు కలిగి నాకేమియుఁ దోచకున్నది. ఈడింభకుఁడీరాజ్యంబునకు ప్రభువుకాఁగానే నేనెటులఁజూడగలను. ఇందుల కేమిచేయుదు. ఇందుల కేమియోచన, వీనినిటనుండి వెడలఁగొట్టింతునా? వెడలఁగొట్టించిననేమి? మఱికొన్ని సంవత్సరములకుమఱలవచ్చును. చెఱయందుంచెదనన్న "లోకులోకాకులో" యన్నటులనన్ను నిందింతురు. ఇఁక నేమియుక్తి? ఇట్టిహానిని మట్టుపెట్టకయుంటినేని దప్పక ముప్పుఘటించును. ఈకుంతల నగరాధీశ్వరుఁడీతని రూపరేఖావిలాసంబులను దిలకించెనేని నచ్చెరువొంది యితనికి తనముద్దులపట్టియగు చంపకమాలినినిచ్చి వివాహంబు చేసి యీరాజ్యంబునంతయు నిచ్చివేయును. ఇందులకెట్టి సందియంబును లేదు. అంతకార్యము కాకమునుపే యితని నంతకునంతికంబున కంపితినేని నేననుకొన్న దంతయు సంతసంబున నెఱవేఱును కావుననిపుడే నాకనురక్తుఁడగు భృత్యునిం బిలిచి, యరణ్యంబునకుఁ గొనిపోయి యెవరు తెలియఁగకుండ వీనినివధించి రమ్మని యాజ్ఞాపించెద.

క॥ ఋణశేషంబరిశేషము
వ్రణశేషంబుండరాదు వ్రణఋణశత్రుల్
గణుతింపనుండెనేనియు
గణనాథుంబైనఁ జెఱుచు గానవధింతుఁ॥
ఎవరురా యచట;

సేవకుడు:—ప్రభో! నమస్కరోమి.

దుష్ట:—ఓరీసేవకా! నీవతిశీఘ్రముంబునంబోయి తలారినాయకుం
డగు దుస్ససేనుం బిలుచుకరమ్ము; తడవుచేయకుము;

[సేవకుడు నిష్క్రమించును.

దుస్స:—ఆలాగే; చిత్తము:

దుస్ససేనప్రవేశము.

దుస్స:—ప్రభో! దండము దండముసామీ.

దుష్ట:—మిత్రా!దుస్ససేనా! నామనంబున సంతులేనివింత సంతాపంబు దురంతంబుగ గలిగియున్నది. ఎంతయోచించినను నాచింతదీరునట్టి యుపాయంబు గానరాకున్నది. నేనేమిచేయుదు. నామాట విన్నమాత్రమున నెల్లవారి మనముతల్లడబడి యల్లలాడుదురు. నేతలచిన నెట్టిపనులనైనపట్టుబట్టి సాధింతును. ఇపుడునీవొక పనినిఁ జేయవలయును. ఈపనిని నోరులెఱింగిరేని తప్పకముప్పువాటిల్లును. కావనతి రహస్యముగా జేయవలయును.

దుస్స:—సామీ! మీపానాలు నాపానాలు శేస్తాం సెప్పండి? సామీ!

దుష్ట:—బయలు పెట్టవుగదా!

దుస్స:—సీతోడు సెప్పనుసామీ!

దుష్ట:—ఓరీ యీమాటను బయట పెట్టితివేని;

దుస్స:—అయ్యా!మీయబ్బతోడండి; నేనాలా శెప్పనుసామీ!



దుష్ట:—కిరాతకా! నీబోటిమిత్రుల సహాయముండినవది యొక గొప్పపనికాదు. అయినను బహుజాగ్రతతోచేయ వలెను. ఈకార్యముబయలు పడెనేని, నాబ్రతుకురోతయై నిందార్హుడనౌదు.

దుస్స:—ఆరహస్యాన్ని నాచెవులోవేయండి. తప్పకచేస్తాను.

దుష్ట:—సఖా! నీకట్టిశక్తియుక్తులుకలవనియే నీపనికై నియమించితి. తప్పకచేసెదవా? ఇదినిక్కమా? ఇదితప్పితివేని.

కమాసు - ఆదితాళం.

చెప్పెదనొకమాట - చెవియొగ్గివినుమిత్ర
యొప్పుగజేయుమిక - నొరులకుదెలియక॥ చె॥

దుస్ససే:—

తప్పనుమీయాజ్ఞ - ధారుణీశ్వరనేను
ఎప్పటికైనను - ఎవరికిచెప్పనయ్యా॥ త॥

ప్రభో! నేనట్లు తప్పువాడనుగాను. మీయనుగ్రహంబునకు పాత్రుడనై మీవలన జీవనము జగుపుకొనుచు, కాలక్షేపము చేయునేను అటులజేయుదునా? అదియెక్కడిమాట.

దుష్ట:—అట్లుండ వలదే, ఓరీ! నేజెప్పు నదంతయుఁ జక్కగా నాలకింపుము.

మదనునితోగూడి - మాట్లాడుచుండెడి
బాలునిగాంచుము - బాగుగదెల్పెదను॥ చె॥

అదిగో! నా ముద్దులపట్టి యగుమదనునితో నాడుచుండు బాలుని జూచితివా?

దుస్స:—

బాలునిగాంచితి - శీలగుణాఢ్యనేను
కాలునివస్థ - కనిపెదదేవా - యిపుడు॥ త॥

చూచితిని దేవా.

దుష్ట:—

విపినంబునకును - వేగమెగొంపోయి
కపటముచేతనె - ఖండించివేగరమ్ము॥ చె॥

కపటోపాయంబున వానినినడవికిగొనిపోయి ఖండించిరమ్ము. వానిని జంపినందులకై యేదైననొకయానవాలును దెమ్ము. నీకు పదివేలరూప్యంబులు బహుమతినిచ్చెదను.

దుస్స:—ఆర్యా! అటులనే జేసెద - పోయివచ్చెద.

[దుస్సేనుడు నిష్క్రమించును.]

దుష్ట (తనలో) ఇకనితడునే జేయుమన్నా కార్యంబును జేసి వచ్చును. నాకోరిక యికనెఱవేఱును.

క॥ తనయిష్టమైనకార్యము
జనుడెవ్వడుసేయువాడె - సన్మిత్రుండౌ
చనదేవినినిమిత్రుం
డనసీచకులోద్భవుండు - నైననునాకున్॥



పథ - చంద్రహాసుడు బాలురతోనాడుచుండుట
దుస్సేను ప్రవేశము.

దుస్స:—బాలకా! ఈలీలబాలురతో నెల్లకాలమాడు కొనుచుండుటనీకు హ్లాదిసకరంబుగా నున్నదేకాని, యెన్నడైననిన్నగరంబున కంతికంబుననున్న యడవియందలి విచిత్రంబులగంటివా?

చంద్ర:—అయ్యా! నేనుబాలుడను అరణ్యంబున కేగుటకునాకుదారి తెలియదు; నీయట్టిపుణ్యాత్ముడెవరైన నాపయింగరుణించి యట్టియడవిని జూపిరేని నానందించెద.

దుస్స:—బాలకా! నేనుమేకంబుల వేటాడనరణ్యంబున కేగుచున్నాడ; నీవునాతోడ వచ్చెదవేనినచ్చటివిచిత్రంబుజూపెద; శీఘ్రంబున వెడలుము: ఆలస్యముచేసిన యెడలనెండయెక్కి సూర్యునివేడిమికిమిక్కిలి తాళజాలకపోల యుదుము.

చంద్ర:—మంచిది యట్లనేపోదము.

[ఇద్దఱు నిష్క్రమింతురు.]



## ప్రథమాంకము - తృతీయరంగము.

అరణ్యము దుస్ససేన చంద్రహాస ప్రవేశము.

దుస్స:—(తనలో,) ఆహా! యేమివింత? ఈబాలునివచనంబుల విన్నది మొదలు నామనంబానందాంబుధిని మునింగియున్నది; ఇతనివదనంబు వీక్షింప బాలచంద్రుని వెక్కిరించునట్లున్నది; కొప్పుకనులును చిఱునగవు గులుకు మోమును చక్కనినాసికయు విశాలవక్షమును సుందరాకారమును గల యీబాలునిపై నాక్రూరాత్మునికేల యిట్టిదుర్బుద్ధిపుట్టెను. ఈతండు సాధారణబాలునివలె మందబుద్ధిగలవాడు కాడు; ఇతనిహృదయమన్ననో నిర్మలంబైనది; ఇట్టి సుగుణాలవాలుని కన్న తల్లి పుణ్యము నువర్ణింపదరంబే; ఇతనిముఖలక్షణంబు వీక్షింప నగొప్ప దశకువచ్చు పురుషుండుగాని; సామాన్యుడు గాడు అయ్యో! యిట్టివానిని పాపాత్ముడై క్రూరచిత్తంబు గొని యనవరతం బితరుల బాధించు దుర్నీతి యీకుత్సి జంపింప నోడిగట్టగదా? అయ్యో! నేనెట్టుల నాచేతులార యితనిఖండింపగలను; ముద్దులబాలుని వీక్షింప నాహృదయంబున మిగుల ప్రేమ కలుగుచున్నదే కాని; లేశమైన నాగ్రహంబు కలుగకున్నది. నేనేమిచేయగలను:



కమాసు - ఖండజాతి.

ఏలాగు - చంపుదునే- ఓదైవమా- దైవమా
దైవమా- బాలుఁ॥ ఏలాగు॥
ఏలాగుజంపుదు - నీలాటిబాలుని
ఎందుకీ- పనికైన- నిందువచ్చితినయ్యో॥ ఏ॥
సుందరాకారుని - సుగుణాకరునిజూడ
మ్రందజేయగబంపె - మందుఁడుదుర్బుద్ధి॥ ఏ॥
చేతులాడవునాకు - ఛేదించవీనిని
పుత్రులుగలనాకు - పోడముపాపముయిక॥ ఏ॥

చంద్ర:—అయ్యా! మీదివ్వనంబునకు విచ్చేసినది మొదలు మీముఖంబువాడి యేదోఖిన్నత వహించి యున్నది. మీరేలననుజూచి దీర్ఘాలోచన చేయుచున్నవారు. అందులకు గతంబేమి దయచేసి యానతిండు.

బేహాగ్ - ఏకతాళము.

ధీర- నీకు- చింత- యేలనో
యీరీతి॥ ధీర॥

ఎవ్వగీరీతి- నిను- నొవ్వగజేసిరయ్యో
చెప్పు- మిక- చెచ్చెరను
చింతమాను- శ్రేయముగు॥ ధీర॥

కోరినాను - శూరా - నేను
నేరామెంచ - బోకు - నాపై
కారడవి - కేల - నను
కోరి - దెచ్చి - నావు - మిత్ర॥ ధీర॥

దుష్ట:— బాలకా! యట్టిదేమియు లేదు. నీ వెవరవు? నీయూరెద్ది? పేరెయ్యది?

చంద్ర:— అయ్యా! నావంటి దౌర్భాగ్యుఁ డీభూమిని బుట్టబోడు. చిన్నతనంబుననే కన్నవారిని, స్వర్గంబున కలిపి, రాజ్యంబును బంధుమిత్రులను ధనకనక వస్తువాహనంబులను బోగొట్టుకొని, యెల్ల సుఖంబులకు వెలియై యల్లలాడు నన్నుగరుణించి యొకదాది పెంపఁబెరిగి కొన్నాళ్ళకునామె మృతినొంద నేనేకాకినై చీకాకుపడుచు నీకుంతల దేశంబున గ్రుమ్మరుచున్నవాడ; నాపేరు చంద్రహాసుడు:

దుష్ట:— (తనలో) అహా! ఈదినము నాకెట్టిసుద్దినము. "మూలుగునక్కపై తాటికాయ పడినట్లు" నేనితని సౌందర్యాతిశయంబులను సుగుణంబుల నీక్షించినది మొదలు వంతనొందుచుండ, నితని కష్టంబుల వింటిని. అది "గోరుచుట్టుపై రోకటిపోటు వలెనున్నది. ఇట్టివానిని నేనెట్టులబట్టి మట్టుబెట్టజాలుదును. (ప్రకాశముగా) చంద్రహాసా! దుష్టబుద్ధికి



నీ వెప్పుడైన నెట్టికీడైనను జేసితివా! దాచక చెప్పుము: అతడునీపై చలపట్టి యీయడవిలో నిన్నుజంపుమన నాకుత్తరవిచ్చెను. నీకుగీడుచేయ నామనస్సొప్పకున్నది.

కమాసు - తిశ్రజాతి - ఏకతాళం.

ఏమని తెలుపుదు బాలా - సుగుణాలవాలా॥ ఏ॥
దుష్టబుద్ధి - ద్రోహమెంచి
కష్టబెట్ట - దలచెనిన్ను
ముట్టుబెట్టి - రమ్మని చెప్పె
నట్టడవిలోన॥ ఏ॥

చం:— అయ్యా! నేనెపుడు నతనింజూచి యెఱుగను. నాబోటి పసిబాలుఁడట్టి వానికి నెట్టికీడునొనర్పగలడు. అతడు కారణంబు లేకయే కోపముబూని యిట్లాన తిచ్చుటకు గారణంబెద్దియో; ఇది నేజేసిన తొలిపుట్టువు నాటి దోసఫలమో? అన్నా! తమకు నాయట్టిబిడ్డలు లేరా? దిక్కులేని నన్నుగాపాడిన మీకు సకలసౌభాగ్యంబులగును. ఇక మీచిత్తము; నాభాగ్యము:

దుష్ట:—

బాలకనిన్నుగాంచ - పరితాపమాయెనాకు
కాలివేలు - గోసెదనేను - కాలునికిజూపా॥ ఏమి॥

చంద్రహాసా! నేనతనియానతినిమీరిన నాశిరంబునతండు ఖండించును; గాన! యధికంబుగనున్న నీకాలియాఱవ వ్రేలినిగో నిపోయిచూపెద. నీవుకుంతలనగరంబునకు కాక యేదేశంబున కైన బోయిసుఖంబుండుము.

[కాలివ్రేలుఖండించి నిష్క్రమించును.]

చంద్ర:—

ఆనందభైరవి - చాపుతాళం.

పాపిటునాపై నీ - పరితాపమొందక
బాధయుగావించెనే - యేమిసేతు
ఏపగిదితాళుదు - ఇబ్బాధనేనిపుడు
అబ్బబ్బాయోర్వను - తబ్బిబ్బులాయెనాకు॥ పాపి॥
కాననమునవిట్లు - గాసిబడెడినన్ను
కరుణజూపినాపై - గాచువారెవరయ్యో॥ పాపి॥

ఆహా! తొలిజన్మమున నేనొనర్చిన పాపసంచయము; కిరాతరూపంబునజన్మించి యీకాంతారంబునకుఁ గొనివచ్చియాఱవ వ్రేలినిఖండించికొని విడచిపోయెను. అబ్బబ్బా! యీబాధకెటులతాళుదు. అంతకంతకు హెచ్చి నన్నంతంబు చేయునటులనున్నదే! పుట్టిననాడే తలిదండ్రులను గోలుపోయి, దిక్కులేక యిక్కట్టులబడుచుండిన నాకిపుడు రక్షించువారలెవరు నిజముగా.



శ్లో॥ మాతాచకమలాదేవీ - పితాదేవోజనార్దనః
బాంధవావిష్ణుభక్తాశ్చ - స్వదేశంభువనత్రయం॥
ఛీ! యెంతమూఢుడనైతిని; లక్ష్మీనారాయణులు నాకు తలిదండ్రులై యుండ నొరులజేరనేల?

భైరవి - రూపకతాళము.

హరిహరిదీనరక్షకా - నారాయణ
అపద్బాంధవ - దుష్టశిక్షక - నారాయణ॥ హరి॥
పరమపురుషభక్తపోషణా - నారాయణ
నిరతమునిన్నె నమ్మినవాడా - నారాయణ॥ హరి॥
కరుణజూపుము కాంచనచేలా - నారాయణ
గరుడగమనకావుమానను - నారాయణ॥ హరి॥

అయ్యో! నారోదన మారణ్యరోదనమాయెనే; ఆహా! నేనెంతపాపిని ఈబాధకు దాళలేనుగదా!

ఉ॥ ఓతలిదండ్రులారతనయుం - గొనిపోవరు దుఃఖమానసో
పేతుడనైవనంబునను - బిల్వనుపేరది లేకయొంటినై
బాతకినైపరుండి కృపాయుతులై కడతేర్చరేననుం
ఈతఱిమీరుదక్కనొరు లెవ్వరిగాననిలాతలంబునం॥

ప్రాణములుపోవు నట్లున్నదే! ఇక నేనునిలువజాలను; నన్నురక్షించుటకు నెవ్వరైననీదారిని రాగూడదా? రక్తమపరిమితముగా కాఱుచున్నదే.

గరుడగమనపరమపురుష - కరుణజూడరాదా॥ గ॥
అనయమునిను మనమున నె
ఘనముగ నెరనమ్మినాడ॥ గ॥
సుందరాంగ - సుజనపోషక
యిందురావదేమిరా॥ గ॥
ఇందువెతల - పడెదునన్ను
నందసుత - గావరా॥ గ॥

### కుళిందుఁడు వచ్చుట.

చంద్ర:—పరంధామా! ఆర్తజనశరణ్యా! అనాధరక్షకా! నా బోటియనాథలను గాపాడ నీవుదక్క నింక నెవ్వరున్నవారు; హా! నామొఱాలకించువారలు లేరే! ఈబాధ నెటుల జీవింపగలను ఇట్టివిపత్తును నాక్రూరచిత్తుండగు తోనె దుర్బుద్ధిగొనరించెనే జగదీశా! కరుణాకరా!

కుళుందుఁడు:—ఏమివింత! యీనిర్మానుష్యమైన ఘోరకాంతారంబున నర్భకుండు చేయుగోదన ధ్వనివినవచ్చుచున్నదే; బాలుండిందులకు రాఁగతంబేమి? వచ్చిననింతసంతాపంబు కలుగనేల? అయ్యో! త్రోవకనుంగొనలేక పరితపించుచున్నట్లున్నది; శబ్దముపడమటి దిక్కుననుండివచ్చునట్లున్నది; ఆదిక్కుకై పోయికనుంగొనెద; ఆహా! వెక్కి వెక్కి యేడ్చుచున్నాడే.



### ధన్యాసి - ఆదితాళము.

ఏలనో - బాలుడు - ఈలీలవనమున
జాలిగ - వెత - నొందా
నేలీలబోదును - నేపురంబునకు
గాంచకవానిని - కాననమందున॥ ఏల॥
బాధకుతాళలేక - వాఁడు
నెందునయున్నాడో
వెదకెదనేని - విపినంబునందున
మదివెతనొందెడు - మనుజునిపుడే॥ ఏలనో॥

చంద్ర:—ఇపుడెవరోమనుజులు నేనుండు తావునకు విచ్చేయునట్లున్నది; కాలిచప్పుడు వినవచ్చుచున్నది. అయ్యా! మీకు నమస్కారము; నన్నుగాపాడ నేతెంచినపాలిటి దైవరాయా! నాపయింగరుణించి నన్నుగాపాడుము; నేను దిక్కులేనిబాలుండను.

తే॥ గీ॥ పుణ్యాత్ములార - ఖేచరముఖ్యులార
మీరలెవ్వారొ నాయెడ - మేలుదలచి
నన్నురక్షింపవచ్చిన - నాధమీకు
మ్రొక్కులిడియెదనాబాధ - చిక్కుదీర్చు॥

కుళిం:—బాలకా! యేడువకుము ఎట్టిక్రూరాత్ముఁడుపట్టి బట్టి యిట్టిఘోరకృత్యం బొనరించెవానికిచేతులెట్లాడును? ఎట్లు బుద్ధిపుట్టె? కట్టా! నిన్నిట్లునట్టడవిలో నఱుకనాయెనా?

నాయనా? చింతింపకుము నేనతిశీఘ్రంబున కట్టుగట్టిని బాధనుమాన్పెద నిన్నిట్టి బాధకు లోబఱచిననరాధము డెవ్వడు?

నీలాంబరి - ఖండజాతి.

పాపీ-యెవడు-నిట్లు-బాధనొందగ జేసె-బాలక తెల్పుము రా॥ పా
విపినంబునకును-వేడ్కగ గొనివచ్చి- వేలునఱక -నాయనా॥ పా॥
పసివాడనంచును-పామరత్వము లేక-యసిధారచేనఱికేనా॥ పా॥

చంద్ర:—

కం॥ ననుఁజంపనొకకిరాతుఁడు
కొనివచ్చెను - వాని వేడికొనఁగృపతోడన్
ననువదలి కాని వ్రేలిని
దునుముకకొనిబోయె బాధ- నొందరపడలేన్॥

హిందూస్తానిరాగం- చతురశ్రజాతి-ఏకతాళం.

కుంతలమందునా నేను-కూడిబాలురతో నుండగా
క్రూరుడునన్నిందు - గొనివచ్చియిటు చేసె॥ కుం॥
నీధరన్ గ్రక్కున- నన్నుగావరే- కన్నవారెగిరి
చిన్నతనంబున-యున్నట్టివాడనయ్యా॥ కు

ఆర్యా! ఒక కిరాతుడునను జంపనిచటికిగొనివచ్చిచంపబోవ నేనాతని మనంబు కఱుగునట్లు వేడికొంటిని. అతడునాపయింగరుణించి నాకాలియందుండు నాఱవ వ్రేలిని ఖండించిన



న్నిరీతిన చింత నొందజేసి పాఱిపోయె. నేనీ బాధకుతాళలేక రోదనంబు చేయుచుండ మీరలేగుదెంచితిరి.

కుళిందుడు:—(స్వగతము) అనపత్యుఁడనైయున్న నాకు దైవం బిట్టి పుత్రరత్నము నొసంగెను. ఇక నేనీతని పురంబునకు గొనిపోయి గారాబంబుగా పెంచుకొనియెద (ప్రకాశముగా) వత్సా ! నీకు తలిదండ్రు లెవ్వరును లేరా?

చంద్ర:—వారుండిననాకిట్టి గతియేమి?

కుళిం:—ముద్దుబాలకా ! నాకుబిడ్డలు లేరు. నేనుకుళిందుడను రాజును పుత్రుని వలె నిన్ను బెంచుకొనియెద. విచ్చేసెదవా?

చంద్ర:—తండ్రీయింతకన్నమిన్నయగుభాగ్యమేమున్నది. అట్టులనేయుండెదనార్యా!

కుళిం:—బిడ్డా! లెమ్ము; నగరంబునకు బోదము.

[ఇరువురునిష్క్రమింతురు.]

## ద్వితీయాంకము - ప్రథమరంగము.

### దుష్టబుద్ధి మేడ.

దుష్ట:—నేనిపుడాలోచించియుండు ప్రకారము నడచిన యెడల ఆసేతుహిమాచల పర్యంతముగల దేశమంతయు నాస్వాధీనంబె యగును. అందులకు సందియంబు లేదు. అయినను చిక్కులు పెక్కులున్నవి.

### సేవకప్రవేశము.

సేవ:—దేవా! నమస్కారము.

దుష్ట:—ఏమిరా! సమాచారము.

సేవ:—దేవా! తమ ప్రియమిత్రులగు సోమశర్మగారీ జాబును మీకిమ్మని పంపినారు.

దుష్ట:—సేవకా! నేనీ శ్రీముఖంబును దిలకించువఱకు నెవరిని లోపలికి వదలకుము. [జాబును విప్పి చదువు టభినయించుట]

ఆహా! యిట్లాయెనా? పుట్టు గొడ్రాలుగా నుండు కుళిందుని పత్నికి పుత్రుకొల్లు కలిగెను. అతం డిప్పటికి పదునెనిమిది యేండ్లవాడట;—ఏమిచిత్రము? కుళిందుడు శీఘ్రంబున మరణంబునొందినపిదప వాని రాజ్యముం నా రాజ్యముతో గలుపుకొనవచ్చునని నిశ్చయించి యుంటిని. అతనికి పుత్రుడొకడు పుడుతగుల బడెనే.



అయ్యో! "తానొకటి తలువ దైవమొకటి తలచె" నన్నట్లాయెనే. ఇక నేమి చేయుదు; అయిన నేమాయె; ఏదేనొక యుపాయము చే సంపాదింపగలను. ఆమాటలో నిపుడు జోలియేల? కానిమ్ము:

### సేవకప్రవేశము.

సేవ:—దేవ! రాజుగారు మిమ్ములను బిలుచుకొని రమ్మనెను. దయచేయుడు.

దుష్ట:—(తనలో) ఈకుంతలాధీశునికి నంత్యకాలము సమీపించినది. ఈని రాజ్యనిర్వాహకమంతయు నా చేతనున్నది. ఈతండన నెంతమాత్రము? అయినను నాకార్యము లన్నియును నెఱవేఱునంతవఱకు లోబడియుండునట్లు నటించెద. (ప్రకాశముగా) సేవకా! జాగ్రతనుండుము.

[నిష్క్రమించును.]



ద్వితీయాంకము ద్వితీయరంగము.

కుంతలరాజు దర్బారు - దుష్టబుద్ధి ప్రవేశము.

దుష్ట:—ప్రభో! నమస్కరోమి.

కుంతలరాజు:—శుభమస్తు; మంత్రివర్యా! కూర్చుండుము.

దుష్ట:—చిత్తము ప్రభో!

కుంత:—సచివాధీశా! నా మనంబున నొక పెనుదుఃఖము సంప్రాప్తమయ్యెను నేను వృద్ధుడనైతిని నాకున్న యొక పుత్రియగు చంపకమాలినికి తగినవరుని దెచ్చి వివాహముగావించి కన్నులా అపేక్షించి నా ప్రాణముల విడువ నిచ్చయున్నది; మంత్రివర్యా! నీయభిప్రాయంబును వెల్లడిచేయుము.

దుష్ట:—దేవా! అవశ్యము చేయవలసినదేను. యౌవనదశయందుండు యువతులకు పరిణయంబొనర్పక యాలస్యంబు సేయుట యొకవిధమైనకష్టమునకు హేతువుగా పరిణమించును. నాకొకటి జ్ఞప్తికి వచ్చినది. కణ్వాపురాధీశుని కొమరితకలావతియను కన్యకకు నామెతండ్రి రయంబున వివాహమొనర్పని కారణంబున, నెవనినో యొకనివలచి వానితోడ నర్ధరాత్రి వేళ నెవరికి తెలియక యాభరణంబుల తోడ లేచిపోయినదట.

కుంత:—మంత్రీ! నాపుత్రికకు రూపలావణ్యాతిశయంబులచే జెన్నారు సుందరాంగు నొకనిం దెచ్చి వివాహంబు సేయుము;



దుష్ట:—అట్టులనే; తమచిత్తానుసారము (స్వగతము) ఔరా! వీని నేర్పు నేనట; వీని పుత్రిక కట; వరునట; తేవలయునట; బాగు; బాగు; నా పుత్రుడగు మదనునకన్న సుందరాంగుడెవడు? సర్వరాజ్యమును నావశము చేసికొని నా పుత్రరత్నమగు మదనునకు చంపకమాలినిచ్చి వివాహంబు చేయనుండగా; వీనికి పట్టిన పిచ్చి నాకేమైన పట్టినదా? నేను వరులకు పోను; గిరులకు పోను.

[నిష్క్రమించును.]

దుష్టబుద్ధి మేడ.

దుష్ట:—సేవకా! మదనుని బిలుచుకొని రిమ్ము; మదనుడు వచ్చుట

మద:—తండ్రీ! నమస్కారము.

దుష్ట:—కల్యాణి; వత్సా! నేనొక యవశ్యమైన పని మీద దూరదేశంబున కేగవలసి యున్నది. కావున నీవతి జాగరూకతతో నింటి యందుండుము; నే బోయిన చ్చెద.

[నిష్క్రమింతురు.]



## ద్వితీయాంకము - తృతీయరంగము.

### కుళిందునిగోష్ఠి.

కుళిందు:—మంత్రివర్యా! రాజాంగవిషయములన్నియుఁగొఱఁత లేకజరుగుచున్నవా? రాజున్యాయంబుగా ధాత్రినిబాలింపఁడేని పాపంబుసంభవించును; రాజ్యంబునందు సుజనులఁబోషింపుచు దుర్జనులదండించుచు సామదానభేదదండోపాయంబులనెడి చతుర్విధోపాయంబుల నుపయోగించుచున్యాయవృత్తినిపరిపాలించుచుండవలయును.అట్లుచేయఁడేని రాజ్యంబునందుండు ప్రజలొనర్చుపాపంబుకొంతఱేనికిం జేరునని పెద్దలువక్కాణింతురు.

ఉ॥ న్యాయముదప్పకుండ భువినాథుఁడుసర్వజనానుకూలుఁడై
వేయువిధంబులన్ సకల వీరులవైరులకెల్లనిచ్చలున్
ఆయెతబాహుశక్తితను నమ్మినభృత్యులజేయుచున్ సదా
ధీయుతుఁడయ్యువిప్రులను దీనులగోవులఁబ్రోవఁగీర్తుఁడౌ॥

కావునసచివాధీశా! సత్యముతప్పక పరిపాలించవలయు.

### సేవక ప్రవేశము.

సేవకుఁడు:—ప్రభో!కుంతలనగరంబునేలుధరణీశ్వరుని మంత్రియగుదుష్టబుద్ధియేగుదెంచి మిమ్ములఁగాంచవేచియున్నాఁడు.



కుళింద:—ఆతండిందులకు రాఁగతంబేమి? ఇదెయాతనిగాంచనరిగెద. [నిష్క్రమించును.]

### కుళిందదుష్టబుద్ధి ప్రవేశము.

దుష్ట:—మిత్రమా! నీకుక్షేమమా?

కుళిం:—ఆర్యా! మీకృపవలనక్షేమమే మీరిందులకు నేతెంచ నేధన్యుఁడనైతిని నామందిరంబు పరమపావనంబయ్యె.

దుష్ట:—కుళిందా! నీకుపదునెనిమిది దేండ్లప్రాయముగల పుత్రుఁడున్నాఁడని వినియాతనిఁగాంచు నాసనొందియిందులకేతెంచితిని ఆకుఱ్ఱని బిలిపింపుము.

### చంద్రహాస ప్రవేశము.

చంద్ర:—తండ్రీవందనము!

కుళింద:—పుత్రా! యీమహానుభావుఁడు వన్నెకెక్కినకుంతలాధీశ్వరుని మంత్రియైన దుష్టబుద్ధియను నామనంబునబరఁగెడిసుధీమణి; వందనంబు చేయుము (దుష్టబుద్ధినిఁజూచి) ఆర్యా! యీ బిడ్డఁడేనాకొమరుఁడు; వీనిపేరు చంద్రహాసుఁడు.

దుష్ట:—నీకుపుత్రులులేరుగదా! ఈతఁడెట్లుతటస్థించెను ఈబాలునిరక్షింపనామనం బధికానందమొందుచున్నయది.

కుళింద:—ఆర్యా! సేవనంబున వచ్చుచుండగా నీబాలుఁడుకాలివ్రేలునఱుకబడి విలపించుచుండె; ఇతనినాగృహంబున

కుఁగొనివచ్చి పుత్రులు లేమిం జేసి యితనినాకన్నకుమారునిగా బెంచుచున్నవాఁడను.

దుష్టబుద్ధి:—(తనలో) ఆహా! వీనింజూడ నాకడుపున అగ్గిపెట్టినట్లున్నది; ఇతడునిక్కముగానే జంపఁబడినవాఁడే. నేనుబంపిన తలవరివీనిజంపక విడిచెనుకాబోలు. ఔరా! ద్రోహీ! చండాలా! యెంతటిమోసంబు చేసితివిరా! ఇక చింతించి ప్రయోజనం బేమి? ఇపుడుపుట్టిమునిగిన దేమియు లేదు; ఉపాయవంతునకసాధ్యం బేది? ఇపుడొకజాబునుమదనునకువ్రాసి యితనికివిషమునిచ్చి చంపునట్లుచేసెద. అపుడునాకోరిక తప్పకసఫలమగును, (ప్రకాశముగా) కుళిందా! హా! యిపుడుజ్ఞాపకమునకువచ్చినది. నాప్రియకుమారుడగుమదనునకు శీఘ్రముగావర్తమానంబొకటి తెలియజేయవలసియున్నది. ఈజాబునుగొనిపోవునతడు మిగులనమ్మకమైనవాడుగానుండవలయును.

కుళింద:—అట్లయిన నా మంత్రిని బంపెద. లేని యెడల నేనే పోయెద.

దుష్ట:—అటులగూడదు నామనంబున నీపుత్రుఁడైన చంద్రహాసునిం బంపిన బాగుగా నుండును. తఱువాత నీయిష్టము వచ్చినటుల జేయుము.

కుళింద:—అయ్యో! యితడతిబాల్యుఁడే.

దుష్ట:—బాలుఁడై యున్నందుననే యటబంపఁగోరితిని. ఇతరులు కూడదు. అదిపరమరహస్యమైనది.



కుళింద:—బాలకా! నీవతిశీఘ్రంబున నీజాబునుగొనిపోయి మదనునకిచ్చి వేగంబురమ్ము; పొమ్ము:

[నిష్క్రమించును.]

దుష్టబుద్ధి:—(స్వగతము) ఆహా! యీచండాలసేవకులు ననుమోసబుచ్చిరి. నేనుజంపింపయత్నించిన బాలుండితడేయని నిశ్చయమగుచున్నది. నాకార్యమువలయుండొక భాగము నెఱవేఱినది. ఇపుడుమించిపోయిన కార్యమునకు తగినయుక్తిని బన్నితిని. ఇకపైఁగుళిందుని వానిమంత్రిని చెఱయందిడి యీరాజ్యమును సాస్వాధీనంబు చేసికొనియెద. చంద్రహాసుడు నాజాబునియ్యగనే నాపుత్రుఁడు వానికి ంబియ్యగలడు; సరిసరి! నాకార్యమిక సంపూర్ణముగా నెఱవేఱును.



## ప్రథమరంగము - ఉద్యానవనము.

### చంపక నర్మదాది చెలుల ప్రవేశము.

చంపక:—చెలీ! విషయా! యీయుద్యానవనము హృద్యమై గనుపట్టుచున్నది.

విషయ:—ఇంతిరో! యిదియంతయునలకాంతుని సహకారియగు వసంతునిచే సకలవృక్షసంతతులు వికసింపజేయుటచే నేత్రపాంతములైనను వింతవింతలు గనుపడిను సమంతనంబున కతిసంతోషము చేయుచున్నవి.

నర్మద:—ఇంతీ! సుదతులచేబంతీ. ఇంతియగాదు తిర్యగ్జంతువులుగనుండు శుకపికశారికాది బృందంబులు నీవసంతునిచేగదా! పనసససాకార ద్రాక్షాది ఫలరసంబులను గ్రోలి; రసాలచూతవ్రాతపుల్ల మల్లికామతల్లికాజాదిపల్లవంబులచే నుల్లంబులజల్లపఱచుకొని చందనమందారారవింద మరంద బృందంబులఁద్రావి; కలకల కుహూకుహూ ఝుంకారాద్యారావంబుల విరామంబులేక, కడిమిఁజేయుచు [illegible]ందంబుల నపరిమితానందంబుల బొందుచున్నవి.

ముందుజూడుము - పక్షిబృందముల్॥ ఓ॥
యిందుని భానన ముందు॥



కీరశారికావళుల్ - పరి - ఘీంకరింపగా
తరులందుజూడ - విరులుఅలరె
వరుసతోడ వామనయన॥ ముందు॥
లీవెభవనముల్ - సావధానివై - నీవుచూడుమా
లతావితానతావిచనుము - భావమున్దున బాధమానును॥
అక్కరో యీప్రక్కచూడుమా - సోం- పెక్కనట్టిపొ
న్నపొగడ విరులగాంచుమా
చక్కగాను మల్లిక లతల్లిబిల్లగా-నల్లుకొనినసొగసుగ
నుమనీరజాక్షి యింపుతోడ॥ ముం॥
నీలవేణిరో యిందు గాంచుమా- నీలోత్పలములసొగసు
కాసారమందునా
చాలగానుపూలగోయుము- సఖియరో వేగా- నేలయిం
కజాగుసేయ మేలముపోదమటకు॥ ముం॥

విషయ:—

చం॥ సరసిజనేత్రయీమలయ - మారుతమీజలజాతమాలతీ
వరగిరిమల్లికావకుళ- వంజుళచూతరసాలమాధవీ
కురవకచంపకప్రముఖ-కోమలపుష్పసువాసనల్ రహిన్
సరగుననిచ్చినీకతిథి - సత్క్రియజేయుచునున్నదే చెలీ॥

చంపక:—చెలీ! విషయా! యోపారత్నంబ! నేడునీభాషనీకే తగియున్నది జగత్ప్రాణంబుగనున్న యీసమీరణం

బు నాకయ్యె; చయ్యన వీచుచున్నవాడు కాబోలు ఏల నన్నీ భాషలచే భూషించెదవు; ఒయ్యారంబంతయు నిన్నే వియ్య మందియున్న దిగదే! మంత్రిపుత్రివగుటం జేసి తంత్రిపుమాటల మానకపోతివి కారణగుణంబులు కార్యంబులనుండునను పురాణవాక్యంబుల ధ్వనికి దెచ్చినావుగదే!

నర్మద:— సరోజాక్షులారా! యీసరోవరంబును గంటిరా! మరాళ రాజంబులు మృణాళంబులఁ దినుటకై వారిజ వనాంతరాళంబుల జేరుతరి తమలో తా మొకరి నొకరు గనుగొనజాలక యెట్టులవికలత జెందియున్నవో (సంతసంబుతో) బాలికలారా! ఏమనవచ్చు నీకాల సౌఖ్యమును.

మత్తకో॥ చల్ల గాలిటువీవ దేహము - సౌఖ్య మొందుచునుండెడిన్
పల్లవోష్ఠి పికస్వనంబులు - పాటలై విలసిల్లెడిన్
ఎల్ల దిక్కులభూరుహంబులు - పల్లవంబుల నొప్పెడిన్
ఉల్ల మేరికిఁ బల్లవింపదు? కల్లగాదిటులుండినన్॥

చం॥ చెలియదిగంటివా - నగము చెంగట బాలచకోర మొక్కటి
న్నిలఁబడి భర్తరాకకయి - నీటుగ నేగతిఁ జూచుచున్నదో
పులుగులజాతి కేయిటుల - పొల్పగు ప్రేమ దలిర్చుచుండగా
నిలనిను బోటివారికిక - నేమనవచ్చునె రాజపుత్రికా॥

చంపక:—(కోపముతో) చెలీ! విషయా! నర్మద; నర్మద కాదు గదా! నర్మోక్తులచే మర్మ భేదిగానున్నదే! బాలప్రాయ



మున నాడుకొనుమున బోటి చేడియలకు వాడిగల్గు నీమాట లాడ బాడియే?

విషయ:—(నర్మదనుజూచి) మర్మభేదీ! మర్మభేదీ. (అనిపిలుచును)
నర్మద:—ఈబోటికి నామాట యాటగానున్నది. చాటుగా నన్ను మాటను పాటించవలెనుగా బోటి!

విషయ:—అహా! ఏమీ! లోకవిచిత్రము. నేనన్న మాట కర్ణకఠోరమయ్యెనే; ఈసన్నుతాంగి యన్నమాట కర్ణామృతంబాయె.

చంపక:—సఖియలారా! ఏలయీమనోవికలత; అల్లదో చూడుడా పొదరింటికి బోదమురండు.

నర్మద:—

చ॥ సుదతిరొ పైనజూడుమల - సుందరకుందలతా ప్రసూనముల్
పదముల ప్రాలుచుండుటకు - భావమదేమియనంగ జాణనీ
రదములసాటిరాము సరె - పాదనఖంబుల పోల్కినైననిం
పొదవగ జేయుమాయనుచు - నోజపదాల కెఱంగి వేడెడిన్॥

చంపక:—మదవతీ! నీమృదువాక్యంబులటుండనిమ్ము. హృదయంగమంబులగు కుసుమ బృందంబులన్నియు నటుల నేయున్నవి. ఆయరవిందబాంధవుండు చరమగిరివరశిఖరంబున హరింపఁబోవుచున్నాడు. ఇక నెప్పుడే కుసుమ విసరంబుల గోసి పూసరంబుల గ్రుచ్చెదరు?

సరసిజనేత్రా! యీసరోజంబులు తమమనోహరుడు కనుమఱుంగవుచున్నాడని మనోవికలతచే, మోములవెలవెలబుచ్చుకొనుమాడ్కి యెట్టుల ముకిళించుచున్నవో కుముదంబులు తమప్రియుడురాగలడనిముదంబుచెందు మాడ్కినెట్టుల వికసించుచున్నవో కనుంగొనుము. ఇటుల నేయాలోకంబున సకలజనంబులుకాలభేదంబులచేతసుఖదుఃఖము లందుచున్నవారు.

విషయ:—చెలియలారా! ఇట్టిపండువెన్నెల యెల్లెడల నిండి కాయమలయపవనుండొడలికివిందుచేయ, చిలుకలుకల కలారావంబుచేయ, నిట్టికాలంబున నీవునొప్పిడిదిన్నెపై రూపరేఖావిలాసంబులచే నొప్పియున్నయొకవిలాసపురుషునింగలిసి, మనంబున ముప్పిరిగొన్న ప్రేముడిదీరునట్లు గుప్పుగుప్పునరతులందేలుటగొప్పసుకృతంబుగదా! అప్పుడే మన స్తిమితంబుగాంచును.

చంపక:—ఏలయీచప్పిడిమాటలు? నీవవ్వారిజాతసుమంబుల గుప్పునగోసికొనిరమ్ము.

విషయ: అట్టులనే! (అని లేచిపోవును)

(దగ్గఱకువచ్చి) భామగోనాయెడమతట్టుఅదరుచున్న

దేచంపక:—అక్కరో! నీవునకాంక్షించినసుఖంబులిక్కడయను భవించెదవు కాబోలు.

విషయ:—నీకెన్నటికినిపరిహాసమే. (అనిమొగముత్రిప్పును.)

---

తృతీయాంకము.

ద్వితీయరంగము - ఉద్యానవనము.

చంద్రహాస ప్రవేశము.

చంద్ర:—నేను దండ్రియాజ్ఞానుసారంబుగ నాపురంబుబయలుదేఱి యతిశీఘ్రంబుగ బహుదూరము ప్రయాణంబుచేసి కుంతలనగరంబునకు సమీపంబునకు వచ్చితిని ఇచట నేదోయొక యుద్యానవనము కనుపట్టుచున్నయది నేనందుల కేగికాసారంబు నందలినీరుగ్రోలి శ్రమనివారణంబు చేసికొనితదనంతరము మదనునికడకేగెదను (వనంబు ప్రవేశించి) ఆహా! ఈ వనముయొక్క శృంగారము ఇందుబ్రవేశింపనామనంబానందాంబుధినిమునింగి యీ వనంబున నుండుచిత్రములైనవానిని కనుంగొన నాశకలుగుచున్నది.

క॥ ఔరా! యీవనమెంతటి
సారముగలదైరహించు జందనతరులన్
మారు నునికి యో యనగను
తీరుగనామనమునీడ్చు దృష్టికరముగన్॥

అహాహా! ఈవనము జాబీరనింబామ్లక పనసాశ్వత్థ కపిత్థ బిల్వాబదరీభల్లాతక కేతకీపున్నాగవకుళ చంపకనారికేళ హింతా

లరసాలసాల చందనాద్యనేకవృక్ష విరాజితంబై దేవేంద్రు నం
దవనంబునకుసాటియసందగి యున్నది.

ఉ॥ వింతగపుల్గులెల్లఁ గనువీనులకింపుగ సుస్వరంబులన్
సంతసమొప్ప బల్కుచును శాఖలనుండటు బారుచుండగా
నింతనరానిహర్షమున నియ్యెడకన్నులకద్భుతంబుగా
జెంతనునుండి కాంచమది చెన్నెసలారెడి నివ్వనంబహా॥

వింతవింతలగు పులుగులు వృక్షశాఖలెల్ల నిండియుండుటం గాంచ నేవిశకుంతంబులో? ఏవిలతాంతములో? తెలియరాక యున్నవి. చిత్ర వర్ణములంగల యీపక్షుల నీక్షించుతఱి నీవనమంతయు నింద్రధనస్సులతో నిండియున్నదేమోయని నామదికిసందియంబుబొడము చున్నది. జలపక్షులు నీటిపై దేలి యాడుచు నీదులాడు చున్నవి. రాజహంసలు సుందరగమనములతో విహరించు చున్నవి. మధురసములాని మత్తిల్లిమధుకరములు ఝుంకారములుచేయుచున్నవి. దూరముననుండి మయూర నినాదములు శ్రోత్రరసాయనంబుగా వినంబడుచున్నవి. ఇట్టి వనంబునఁ జింతలచే వంతనొందుమనుజుడు కొంతవిశ్రమించెనేని దురంతసంతాపవిముక్తుడౌయమందానందంబు నొందునను టకు సందియంబులేదు.

[అనిమెచ్చుకొనుచు జలంబులగ్రోలి]

[గుఱ్ఱమునొకచెట్టునకు గట్టితరుసీడను విశ్రమించును]



విషయ ప్రవేశము.

విషయ:—ఆహా నాచెలులాప్రదేశముననుండు పుష్పంబుల నన్నిటిని గోయుచుందురు నేనింతవఱకుఁబూవులంగోయకయే చంపకమాలినితో సరససల్లాపంబులచేఁ బ్రొద్దుపుచ్చితిని. ఇకవారలిచటికి వచ్చిరేని నాసోమరితనంబునకై నన్ను పరిహసింతురు. కావున; నిచ్చటనుండెడి కుసుమంబులఁ గోసికొనియెద.

(అడుగెత్తిపెట్టి) ఇదేమిచిత్రము: అకస్మాత్తుగా! నాయెడమ భుజమును కన్నులదఱచున్నదే;ఇదియిట్టుల నదరుటకుఁగారణంబెయ్యది? స్త్రీలకిట్టిచిహ్నంబులు కానుపించినయెడల శుభంబు కలుగునని పెద్దలువచింతురు. అట్లయైననిపుడు నాకెట్టిశుభంబుకలుగునో యెఱుంగఁజాల.

(యోచించి) ఓహో! యిక నాకు గావలసినదేమి? వివాహముకదా! అది యిపుడగునా? ఓపిచ్చివిషయా! ఊరకలేనిపోనియాశలు బెట్టుకొనుచు నేల యల్లలాడెదవు; ఏదైనను: శుభము రానున్నదే!

(మోయనుచు ముందుకునడిచి)

ఆహా! యిందెవ్వరిదో యొక యశ్వమున్నదే ఇది యెవరిదైయుండును; రాచకన్నియలు విహరించునియుద్యానవనమునకుఁ బురుషుఁడు రాఁగతంబేమి? ఇందుల కేలవచ్చియుండును ఆహా! యేమి! ఈతురగంబు సొంపు.

కన్నడత్రిశ్రజాతి - ఏకతాళము.

ఔరా- యీతురగమెంతో- అందమైనది-చూడు॥ ఔరా॥
పరమేష్టిపాటు - బడి తురగమునిటుసృష్టిఁజేసె
తరమగునానుతియొనర్ప- దీని-మేని- కాంతి-గాంచ॥ ఔ॥
శుభలక్షణములుగలిగి - శోభిలుచున్నదిరూపు
నిరతముదీనిపైనియెక్కు-- పరమపురుషుఁడెవఁడోగాని॥ ఔ॥

శా॥ సైరా యీతురగంపుసొంపుఁగనిన౯-సంతోషమయ్యె౯మ
ది౯-మేరాదీనిని జేర్కొనంగభువిలో-మేల్రాజులైన౯బురే
యీరాజీవభవుండుసీతురగము౯-హాయి౯సృజించె౯బళీ-యే
రాజేంద్రుఁడుదీని నెక్కఁదగనో - యేమంచునే జెప్పుదు౯॥

ఆహా! యిట్టిసుందరంబులైన జంతువులసృజించికదా! పితామహుండు తనసామర్థ్యమును వెల్లడి చేయుచున్నాడు.

(అటుచూచి) ఓహో! యిందెవ్వరో సుకుమారసుందరాంగుడు లతాగృహంబునకుఁ జేరువఁబరుండి యున్నవాఁడు. ఈగుఱ్ఱమితనిదేకాబోలు. ఆహా! యెంతసుందరవంతుఁడై యున్నవాఁడుకంతుజయంతు వసంతుల గెలుచునంతటి రూపరేఖావిలాసమున భాసిల్లుసీకుమారుఁడు, కుమారుఁడో? లేకమారుఁడో? ఈమేటిని గలియనిబోటిభాగ్యమేల? రూపముగాంచిన నారులకుఁదాపము కాంచనివారికి పాపముమారునకుగోపము. పెండ్లాడనికాంతదిలోపము. నాగృహమునకితఁడు దీపముదక్కఁడేనినాకు శాపము. ఆహా! యితనినేమని వర్ణింపగలను.



నాటకురంజి-చతురశ్రజాతి- ఏకతాళము.

భాసురాంగుఁ-డిందులఁగాంచా-పవళించెసొంపుగ॥ భా॥
మారురూపమునను-మీరిశోభిలుచును- నీరజనేత్రుఁడు
నిరుపమగాత్రుఁడు॥ భా॥
సన్నుతికెక్కిన - సార్వభౌమునిఁగాంచ - చానలుమో
హించి సరసతోఁగూడరె॥ భా॥

తే॥ గీ॥ చెలగిజగమెల్ల మోహింపఁజేయజాలు
నవవిలాసాప్తినెసగను - న్నాఁడుచూడ
వహహాయీరాచమిన్న - సోయగముగన్న
వలచిపైవ్రాలరేయెట్టి - పొలతులైన॥

తోడి - రూపకతాళము.

కానసీసమానమానవు౯ - కనులలరగధరణిస్థలి౯॥ కా॥
పున్నమసుధాంశుకళ - నెన్నదగినముద్దుమోము
కల్వరేకులనంటికనులు - గాంచగగ్గలునుమోహము
కాంతలకీతని గూడగ॥ కాన॥
చెక్కులద్దములనుబోలు - నెక్కువైనమేనికాంతి
మక్కువతోవీనిగూడు - మానినిజన్మముసఫలము
మానకయీతనిఁ బడసెద॥ కాన॥

ఉ॥ కన్నులవింటిదంటయును-గల్వలనెచ్చెలియు౯వసంతుఁడు౯
గిన్నరరాజనందనుఁడు - గిమ్మనజాలరొకింతమైనని

వ్వన్నెలసోకమేనిచలు - వమ్మగనుంగొనమేలు మేలుహా
కన్నులపండువై యలరు - గాజవరాంద్రకువీనియందముల్.

సీ॥ తొలికాఱుమెఱుగులో - తొలుకాఱుతీవెయో
యపరంజియో లేక - యంగమేనొ
కంజంబులోమాయ - కంజరీకంబులో
కలువలో లేకవి - కనుగవో కొ
పూర్ణేందుబింబమో - పొందామరోనిద్ద
మాయద్దమో లేక - యాస్యమేనొ
బంధూకమో కెంపు - పగడమో పండిన
బింబమో లేకధ - రంబదేమొ

తే॥ గీ॥ పల్లవంబులో లేకవి - పదములో కొ
హస్తిహస్తమ్ములో లేక - హస్తమొకొ
మరునిపీటంబొ లేకది - యురమొ యేమొ
బాలచంద్రుడొ లేకది - ఫాలమొకొ॥

ఔరా! మొలకమీసముల సొగసు! కనుబొమలతో గయ్యము నకుగాలుద్రవ్వుననం బైకి నిక్కియొకసక్కెము లాడుచున్నవి. నాసికంబు చంపకంబు డంబును గాంచును. మూదుకుబోయిచూచి ఇదేమికదలుచున్నట్లు తోచుచున్నది. నిజముగా నిదురించుచున్నాడా? లేదా? లేదు నిదురించుచున్నాడు చూడజూడనీపురుషుడు కుమారుడా? యేమి? సైరా? యెంతటి సుందరాంగము.



సి॥ శరజాతుడైనయా - పురుషోత్తమునివక్షు
సుఖమొందునదెలక్ష్మి - క్షోణియందు
విశ్వమనోహర - విగ్రహుండగువీని
బొందినదేరతి - భువనమందు
అఖిలకళావాలు - డైనయారాజుతో
నున్నదేరోహిణి - యుర్వియందు
నలసర్వమంగళాం - గాంగుడౌయీశుని
బెసగినదేసతి - పృథ్వియందు

గీ॥ కానవీనిబోలు - వానినిమానిని
చెట్టబట్టదేని - పట్టుబూని
తలచిచూడనదియ - సౌభాగ్యనాతిగా
నేనుబెండ్లియాడ - నేనియటులె॥

ఈ విశ్వమనోహర విగ్రహుండెవడో? ఈయనంగసుందరు నిబొందనేని బ్రమందవలసినదే! కోదమసింగము భంగినలరారు నీ తనియందము, నాకందము, పులకందము.

ఔరా! వీనియందము:

సీ॥ కన్నులారగవీని - కమనీయరూపంబు
కాననియాకాంత - కనులుగనులు
తేనెలొల్కెడివీని - తియ్యనిపలుకులు
చెలగివిననినాతి - చెవులుగవలు

కమ్మనౌయువ్వాని - కెమ్మోవిసారంబు
వాంఛనాననిభామ - వాయిగోయి
తమిదీఱనివ్వాని - తనువట్టిబిగబట్టి
మేనుజేర్పనియింతి - మేనుమ్రాను

గీ॥ ఆశతోఁవీనిరూపంబు - నాత్మయందు
ఘనతమైనిల్పనిలలన - మసమువనము
ఇట్టిసుందరమూర్తితో - నింపుగాను
చక్కనివసింపనిచెలువ - శుఁగుముశుయము॥

ఉ॥ తుమ్మెదదిమ్ములఁబొమ్మనుచుద్రోచునిగారపుసోగపెన్నెఱుల్
కమ్మని తమ్మిఁగ్రొన్ననల - గాదనుముద్దుమొగంబు మించుట
ద్దములనిమ్ముల౯ గెలువ - దార్కొనునిద్దపుఁజెక్కుదోయిడా
లమ్మక చెల్లవీనిచెలు - వమ్మకరాంకునినేలజాలెడి౯॥

ఆహా! యెంతని వర్ణింతును; ఇతఁడునలకూబరుఁడో! లేకమా
రుఁడో! అహాహా! వీనిసొగసు:

సీ॥ మొలకనవ్వులవాఁడు - తళుకుసిద్దామేల్క
డానిడాల్గలచుమే - జానువాఁడు
తొగరువాతెఱవాఁడు - తొగలసంగడికాని
దెగడునున్నుద్దునె - మ్మొగమువాఁడు
బెడదకన్నులవాఁడు - వేల్పురారాసారు
నిరసించుసోగపె - న్నెఱులవాఁడు



మెఱుగుఁజెక్కులవాఁడు - మేటిసింగపుగున్న
నడలించుజిలుగునె - న్నడుమువాఁడు

గీ॥ డంబుమీఱినబవిరిగ - డ్డంబువాఁడు
గంబునిభమైతనర్చుకం - ఠంబువాఁడు
భళిరయీరాజకందర్పు - చెలిమినాకు
గలుగవలనదె తొలిపుణ్య - ఫలముకలిమి॥

ఇది యేమి! ఇతఁడుమేల్కాంచునటులదోఁచుచున్నది. (చూచి) కాదు; కాదు; ఇంక నితఁడు నిద్రలోనటువైపునకు బొఱలుచున్నాఁడుకాని మేల్కొనలేదు. అదేమో యాతనియంగిచుండినేలపైబడినది చూచెదఁగాక (అని మెల్లనె వానియొద్దకుఁబోయి చీటినిచేతికెత్తికొని.)

చిత్రము! చిత్రము! ఇదిమానాయనగారిచే మాయన్నగారికివ్రాయబడినకమ్మనిజముగా నివ్రాతమాతండ్రిదే; ఇందేముండునువిప్పిచూతునా? చూచిననేమి? తండ్రివ్రాసినజాబుకూతురుచూడఁగూడదా? చూచిననేమిబాధ? విప్పిచూచెద: [అని జాబును విచ్చిచదువును.)

క॥ శ్రీరస్తు! దుష్టబుద్ధి కు
మారునిదీవించి సిరులు మలయఁగ వినుమా
యీరాజకీయకార్యం
బారయగోప్యంబు సలుప నామోదమగు౯॥

ఇందేమో రాజకీయకార్యమున్నదట; దానినిగాంచిన సంతోషమువచ్చునట; అది యెట్టికార్యమో చూచెద.

క॥ మనకుమహాహితుఁడీతుఁడు

ఏమీ! లోకమునకంతయుపాత్రుఁడై యుండునట్టి యితఁడుమనకుమాత్రము ఎటుల అహితుఁడగును. ఛీ! తప్పర్థముచెప్పితిని మహాహితుఁడే మనకు అగును సరి॥

మనవిషయాధీశుఁడగును

[సిగ్గుతోతలవంచికొని] పిచ్చివిషయా? లేనిపోనియాసలఁబెట్టుకొనియల్లాడకుము, మనవిషయాధీశుఁడగునన - మనరాజ్యమునకు రాజగునని యర్థము.

మనకా విషయం

బునగలుగుముదమురాగము
తనయా? యోచింపకిమ్ము త్వఱగావిషముః॥

అయ్యో! కడపటనిట్టులాయెంగదా! అహా? మాతండ్రికడపటవిషమునిమ్మని వ్రాసెనే కటకటా! దీనికేమిచేయుదు? [యోచించి] ఔనౌను: ఇదియిటులుండిన బాగుండదా! విషయః అని ఇపుడుముః అను దానినియః అనుటగామార్చెద. [ఒక ముల్లెత్తికాటుకనద్దిదిద్దును.]

[సరియైయున్నదో లేదోయని చదువుచున్నది]



క॥ మనకు మహాహితుఁడీతఁడు
మనవిషయాధీశుఁడగును - మనకావిషయం
బునగలుగు ముదమురాగము
తనయా యోచింపకిమ్ము - త్వరగావిషయః

ఇపుడిదిసరిపోయెను; ఇకనీజాబును యథాస్థానంబున నుంచెద. (అనిపెట్టును) ఓజగధీశా! నాపనియైనది; ఇకనంతయు నీసహాయముండిన నెఱవేఱగలదు.

ఇక నేనిచట మసలుచుంటినేని నాసఖులువత్తురు; వారు కాంచిన సందేహింతురు: నేనిచటనుండి వారురాకమునుపేనా చెలుల కడకుంబోయెద.

జగధీశా! అబలనగునా ప్రార్థనవంగీకరించి నాకార్యంబు సఫలంబగునటుల నాకుఁదోడుపడుము. పోవుచున్నది]

చంద్ర:—ఆహా! యెంతటిపాపిష్టినిద్ర నన్నెంత మోసపుచ్చెను. దుష్టబుద్ధి యతిత్వరితంబున జాబునుగొనిపోయి తనపుత్రుండగు మదనునకియ్యనాజ్ఞాపింప నేనుమార్గశ్రమచేనిందువిచెడి మందమారుతంబునకు మైమఱచినిద్రించితిని; ఇక నాలస్యంబుజేయకమదనుని కడకేగెద:

[అనుచు దిగ్గునలేచినలుగడలు పరికించును]

ఆహా! యిదేమిచిత్రము ఆప్రక్కననిందింది రాలకయు, సకల సలక్షణపాళికయు, తనుజితచంపక మాలికయునగు నొక్కబాలికామణి.

గీ॥ మేఘనిర్గతమైన-క్రొమ్మించనంగ
శంబరారాతియాలవ - శరమనంగ
దేవలోకాగతాప్సర - స్త్రీయనంగ
వారిరుహగంధియచటికి - వచ్చెఁజూడ॥

ఈరమణీలలామ దేహారామంబామరునకు మనికియైనది. తనూలత స్తనంబులను పూగుత్తియలచే నూఁగులాడెడి కరచరణంబులను పల్లవంబులుల్లసిల్లె; కనుదమ్ములువికసించె; నాసాచంపకంబుప్రకాశించె; రదనంబులను కుందమ్ములు ముదంబొదనఁజేసె; అధరంబుబింబమైగనుపట్టె; ఈమేటిబోటిసాటి పాటల గంధులుధరనుందురా! లేరు; లేరు; మఱియునీమంగళాంగియంగముల భంగిముజ్జగంబులను గలవా?

సీ॥ పుండరీకాక్షియీ - భువనైకసుందరి
యాత్రేయవదన యీయజ్ఞగంధి
పర్వతజఘన యీభామాశిరోమణి
మాతంగగమన యీమంజువాణి
శాండిల్యకుచయీయ - ఖండతేజోనిధి
శుకవాణి యీమణి-ప్రకరరదన
భృగుకటిభాగయీ - బింబఫలాధరి
నారదవేణియి - న్నాతిమిన్న



తే॥ గీ॥ యాకారయీయింతి-పరమహంసాకృతులను
బొసగియున్నది-యాకార భువినిదీని
నెయ్యమెడగూడవానికి - న్నిద్రనిబిడ
నిరుపమానందయోగంబు-దొరకుటరుదె?

కమాసు - ఏకతాళము.

తోయరుహాక్షియీనారి - కాయజుకోలయో-కలభగామి
నియో॥ తో॥

మెఱయుచునున్నట్టి-మెఱుగుదీగయోయిది
మురహరురాణియో - స్మరహరుసతియో॥ తో॥
వరరుచిమించెడి - వనదేవతయో-వనజాసనురాణి-వాసవు
(సుదతియో॥ తో॥

ఇంతులలోమే - ల్బంతియనందగు
సంతసమయ్యెడు - నింతినిఁగాంచగ॥ తో॥

క॥ నదమాపాక్కిలజాంబూ
నదమామెయిచాయకోక - నదమాపదమా
పదమాజడనడుమువియ
త్పదమానూగారుగూఁకె - పదమాచెలికిన్॥

గీ॥ సరసలీలనుహాఘనచయమునాత్మ
దర్పకశ్రీనియునుగూడి - కువలయనయన
కచకపోల విలాసమై - ఖరులుపొగడ
మొగిననేకశతాబ్దంబు - లగుచునుండి॥

మోహన - చాపుతాళము.

మారుని-మితారియో-నారీమణి- నవమోహనాంగియో-హా॥
ఊర్వశి మేనక-యువిదలకంటెను - మీరినయందము-మెఱుగో
కో-కనకమో॥ మా॥
సోముని గేలి సేయు- కోమలియాస్యమే మొ- క్రమ్మెడితావిమో
విధునకుచకోమలిది॥ మా॥
నిద్దపు చెక్కులు-నిగనిగ మెఱయుగా - ముద్దియగజగమ - నంబు
తోనడువా॥ మా॥
ఇద్దరనే- గాంచ - నిట్టినాతిని నేను - ఇద్దవళాక్షికి - సీడగునిం
తిని॥ మా॥

సీ॥ చంద్రబింబస్ఫూర్తి - జానొప్పెనీనాతి
హాసాధరంబులు - నాననంబు
కోకనదాకృతి - గొనబాఱెసీకొమ్మ
స్తననాభిబిలములు - చరణయుగము
కమలధరోద్వృత్తి - గనుపట్టెనీయింతి
కరజఘనంబులు - కచభకంబు
మధుకరసాదృశ్య - విధినొప్పెనీ లేమ
మృదువచనోరువ - మెఱుగుటారు
గీ॥ వజ్రపుష్పాతిశయలీల - వఱలెసివి
లాసిసీరథాంగకంబులు - నాసికయును
భళిరయీరామసౌందర్య - పటిమయెన్న
నన్నలినగర్భునకునైన - నలవియగునె?



క॥ తమ్ములు చెలికరములు కుం
దమ్ములు పలువరుసపర్వ - తమ్ములుబలుచం
దమ్ములు చన్నులుతోవలం
దమ్ములు కనులలకలంబు - దమ్ములుపొగడన్॥

అహా! దీనిమిటారిసోయగమ్ము మోహమ్ములూరుచూపులు
ను కుచంబులసొంపును సిక్షింపవీక్షింపనింకను జూడనాశను
బురికొల్పుచున్నది.

సీ॥ అమృతాకరంబుగా - నతివకన్నులుచూడ
స్మరునిదర్పంబును - చాలజాటు
సరసంబుతొగద - సతిభ్రూలతలుచూడ
మదనశరాసన - మహిమ తెలుపు
సుమనఃప్రియంబౌను - సుదతియాఱదిచూడ.
మారునిసన్మారి - తీరుఁజూపు
అళులకామోదమౌ - నబలముఖముఁజూడ
ప్రద్యుమ్నశరజాల - పటిమజెప్పు
గీ॥ చక్కఁఱలరుచిఁ గాంచును - జాననుడులు
మరునివార్వపువిద్దెను - సరవినెంచు
నెంతవర్ణింతునీయింతి - కంతుదంతి
శేషఫణికైనఁ జెప్పంగఁ జేతకాదు॥

కం॥ తొడలందము కటిచందము
నడుగుందమ్ముల బెడఁగు - లాస్యమురంగుల్
జడతళుకుఁ బొడకులుకుఁ
నడబెళుకుంజూడనాఘు - నస్తనికమరుఁ॥

గీ॥ చిన్నచీమలనును బారు - చెలువయారు
కదళికాకాండములమీఱు - కాంతయూరు
లందముల జెందితిమిమీఱు - నతివసారు
దానికెనయైననారులి - ద్ధరణిలేరు॥

అహా! దానిసౌందర్యంబెంత వర్ణించినఁదనివితీఱకున్నది.

ఉ॥ గుబ్బలనీటు,మోముపస, కుంతలబృందమునిగ్గు, కౌనులో
జబ్బుతనంబు,కన్నుగవచందము, చెక్కులతేట,మోవినుఁ
గబ్బిచకచ్చకల్,రదనకాంతిఁ కటిస్థలియుబ్బు,కంధరం
బబ్బుర,మాటతీఱు,దరహాసముహాసముదంబు చూడఁగ౯

గీ॥ చక్కదనమెల్లరాశిగాఁ జక్కఁద్రోచి
కమ్మకస్తూరిచేవ్రాసి - కలుగఁబోసి
చేసినాఁడేమొయాబ్రహ్మ - చేతివాసి
డాసిమెచ్చడెచెలిసిస - న్యాసిమైన॥

[అని గుఱ్ఱమెక్కి పోవును.]

---

తృతీయాంకము - తృతీయరంగము.

చంద్రహాస పుర ప్రవేశము.

చంద్ర:——ఈకుంతలదేశంబున నెచ్చటచూచినను సుందరమైన హర్మ్యంబులును వినోదమైన యుద్యానవనములును గలిగి యీభూమండలంబున వన్నెకెక్కియున్నది.

తే-గీ॥ విమలసుమనః ప్రమోద-రాగములఁదనరి
పల్లవప్రాప్తిచేమించు - ప్రౌఢనార
వనితలారామములుగల్గి - వన్నెకెక్కు
భూమిరత్నంబుకుంతల - పురవరంబు॥

క॥ ఆపురముల రాలలనా
నూపురమైరత్నసౌధ - నూతనరుచిక౯
రాపురమైయభ్రంకష
గోపురమైపొగడనెగడు - గుంభినిలోన౯॥

ఈపురంబునందలి రాజవీధులెంత ముచ్చటగా వరుసలుతీఱియున్నవి.

సీ॥ మంజులమాణిక్య - పుంజరంజితఘన
ప్రాకారచుంబితా - భ్రస్థలంబు
చంద్రకాంతోపల - సౌధపాండురకళా
ప్రేఁడితప్రాలేయ - ఘృణికరంబు

రత్నకుడ్యావళి - రమ్యాంశుసందోహ
బహుళీకృతార్కప్ర - భాచయంబు
గంభీరపరిఖావి - తాంభచ్ఛటాతమో
లోకీకృతాధర - లోకవితతి

తే॥ యామికాహతిజాత - దిశాధినాథ
పురభయంకరభేరితా - భూరిదంద
ణంధణధణధ్వనిప్రతినాదదాయి
గోపురంబొప్పుదిక్కృత - గోపురము॥

ఈపురంబునకు సాటియెందైనం గలదే ఇట్టిపత్తనంబునేలు ధరణీశుఁడెంతటి పుణ్యాత్ముఁడో గదా! ఇకమదనుండుండు సదనంబు కేగెద:

మదనుని మేడ చంద్రహాస ప్రవేశము.

చంద్ర:—సేవకా! నీవతిరయంబున నేగి మదనునకు నారాకం దెలుపుము.

సేవ:—దేవా? మీరెవరు? ఇటకేల వచ్చితిరి.

చంద్ర:—సేవకా! నేను కుళిందదేశాధీశుని పుత్రుండను నా పేరు చంద్రహాసుఁడందురు; మదనుని తండ్రియగు దుష్టబుద్ధిపంపిన జాబునుగొని వచ్చినాడను.

[సేవకుఁడు నిష్క్రమించును.]



మదనుఁడు—సేవకుఁడు.

మద:—సేవకా! ఆలస్యంబు చేయక యాతని నిటకు దోడితెమ్ము:

చంద్రహాస ప్రవేశము.

చంద్ర:—వందనంబు చేసెద; సుగుణాలవాలా! నీదు జనకుండీక మ్మనుచు నీకిమ్మని నన్నతిత్వరితంబున బంపెను [అని జాబునిచ్చును]

మదను:—మిత్రమా! యిందుఁ గూర్చుండుము.

(మదనుడు జాబు విప్పి చదువును.

కం॥ శ్రీరస్తు! దుష్టబుద్ధికు
మారుని దీవించి సిరులు - మలయఁగ - వినుమా
యీరాజకీయకార్యం
బారయ గోప్యంబు - సలుప - నామోదమగున్॥

కం॥ మనకు మహాహితుఁడీతఁడు
మనవిషయాధీశుఁడగును - మనకావిషయం
బునఁగలుగు ముదము రాగను
తనయా యోచింపకిమ్ము - త్వరగా విషయన్॥

(తనలో) ఆహా! ఇదియేమివింత? యిటుల వ్రాసియున్నవాఁడే! ఇతని కులగోత్రముల నేమియు విచారింపకయు, నితడు విద్యావంతుఁడా? మూఢుఁడా? ధనికుఁడా? దరిద్రుఁడా? అధికుఁడా! అల్పుఁడా? యని యోచింపక త్వఱగా విషయనిచ్చి పెండ్లి జేయుమని వ్రాసియున్నాఁడు. నేనాలస్యంబొనర్చనేలా; దానపిత్రునా

జ్ఞను మీఱినవాఁడనగుదును. కావున బ్రాహ్మణుల బిలిపించి ముహూర్తంబు నిశ్చయించి, వివాహంబు కావించెద; (ప్రకాశముగా) చంద్రహాసా! నాజనకుఁడు క్షేమముగనున్నవాఁడే; నామనంబానందంబు చెంద, నీవిటకు నేతెంచినది నేనుతొలిజన్మమున జేసినపుణ్యఫలమేగాని వేఱుకాదు. మనము స్నానఘట్టంబునకు బోదము రమ్ము:

సేవకా! నీవతిశీఘ్రంబున నేగి మనరాజ్యంబునందలి జ్యోతిష్కులఁబిలుచుకొని రమ్ము:

[అందఱు నిష్క్రమింతురు.]

చతుర్థరంగము - విప్రులహాస్యము.

కామావధానులు:—గంగుబొట్లుగారూ! ఏమిటండి. మీరేమో అవసరపడ్తారు. ఇపుడెక్కడికి ప్రయాణమండి.

గంగు:—ఎచ్చటికా! కుంతలనగరానికి.

కామా:—ఏమి విశేషము?

గంగు:—దుష్టబుద్ధికుమార్తెకు వివాహమట; పోదము రండు.

దండకము.

కామా:—ఓయెల్లిబొట్లా! గణేశాయ. కామేశ్వపుల్లావధాన్లూ విరూపాక్షశాస్త్రుల్లు-మాగంగుబొట్లండి? దుష్టబుద్ధిపుత్రికకు పెండ్లియట. భక్ష్యభోజ్యాలతో- చారుమృష్టాన్నముల్ బెట్టుచున్నాడసా. బ్రాహ్మలమేమో మహా- జేరుసంచారు ఊరకుంతాన్నవు- దర్భాసనంర్ఘూరి- చెంబున్నవ్వడింగెచ్చిగా-



వంచకుంగట్టు- విస్సప్పనీబుద్ధిచక్కల్లు-నీచేష్టపోకిళ్లుసీమాటమాధుర్యమేచాలుగా- మేము వస్తాముగా. నాడునానాటికిన్ వర్తమానాలు, అమృతోపమానాలు ద్రెస్తావు. మా బ్రాగువస్తాము - లే, యింటిలో నేమిద్రెస్తుంది? ఆశౌచమే పోయివస్తాము-ఇంకొక్కమాట - విశాలాక్షి యచ్చోటసంతర్పణల్ భక్ష్యభోజ్యాలసౌకర్యముల్-చూడ తావస్తుతానంచుజూస్తుంది - బాగేకదా! బ్రాహ్మలీమచ్చోటతృంపోవ తృంపిళ్లుగా జేరినంచారు, ఆపంక్తి పాకాలలోరోష్టుజేస్తారు, వేరేసాయంపాకముల్ జేయవద్దా? సరేగానివారన్నియుఁదెచ్చి విస్సళ్ళు తెస్తారో తేరోకదా, వారు తేరంచు మీరింక తెస్తారుకాబోలు.

పేరిశాస్త్రుల్లు:—ఏమిటయ్యా మీకు లావుచాందస్తమే, వారన్నియుం దెచ్చి విస్సళ్లు తెప్పించరా, సంతర్పణల్ చేయుచోటిష్టులన్ భ్రష్టులన్ జూడరా, గోష్టుల్తో కెట్టునిష్టత్వ శిష్టత్వ శ్రేష్టత్వముల్ గల్గునే, నేష్టుగావస్తురా? వస్తినేవచ్చి పంక్తిన్- పృణత్తంచ తెమ్మంటినా కోపగిస్తారు - నేనప్పుడన్నుంటే యేముంది మాకాసి, సద్బ్రాహ్మణుండెక్కడైనన్ ఋక్షుదాయుక్తుడై యుండుచోటన్, సాయంపాక ముంచుందనే మాటయుంచుంది.

తిమ్మావధానులు:—రామావధానులు అదేమోకదా, పాకశాలాసమీపానకున్, మాటలేమే మొత్రెస్తారు, కార్పాసమా•

రామా:-వెఱ్ఱిప్రాడ్వాక! వార్తాకముల్ చూచి కార్పాసమంచావు

మల్లుభొట్లు:—గోపాలశాస్త్రుల్లు? చూశార వారాంగనల్వింతిగా విద్యలం బ్రొద్దుపుస్సారు ఈలాగుసాగీలు త్రైస్సారు, క్రె మ్మొన్నవులిస్సారు, క్రేలింపజేస్సారు, స్రొక్కింపజేస్సారు, కాబట్టి చిత్తభ్రమం జెందుచుఙ్ వారికేదద్దు లేకుండ యిస్సారు. మీరేమిజేస్సారయా? కొండుబొట్లూ? రహస్యార్థముల్ తేటజేస్సావుమంచి దలకొక్కప్రశ్నర్థముఙ్ సావధానంబుఙోడఙ్ విచారింపుమా ఇప్పుడీ స్త్రీలు ఈలాగు సంగీత సల్లాపముల్ చూపుచారే, మనస్త్రీలకీ సొంపురాదేమి కోనేరిభొట్లూ యదార్థంబుగా జెప్పుమీ, తాళుడీమీ కునిష్కర్షగామూల మేలత్స్యముఙ్ జూపుచూసాపుగా జెప్పు చాచిత్తగిస్తారూ? వారాంగనల్ విద్యలంబొద్దుబుస్సారు కాగామహాపేరుప్రస్సుంది ఈప్రజ్ఞలీబుద్ధలీసత్యశౌచంబు లిష్టాతపస్సిద్ధియీ దానధర్మంబు లిష్టాపదాచారసంపత్తు లేస్త్రీలకుంగల్గునో? యారా! యష్టాటిమాటాసరే కీలుగం తాన్నవునీచాందసం బెక్కడంజూడగా లేదు. కోనేరుభట్లూ? భళా శుంఠలంగూడి ప్రాడ్వాకవై నావురా పప్పుప్రణ్ణా లుపృష్టోష్ణపర్యంతముండింటె సీవల్లుమత్తెక్కియేమేమిక్రూస్సావురా-మన్మథభ్రాంతినిన్నింత జేస్సుందిరా వేసరుఙ్ సత్యశౌచంబులుఙ్ స్నానసంధ్యాద్యనుష్టానముల్గల్గునంచావు సినోరుప్రుస్సుందిషూ! కాసువీసాలకై సత్కులాంచారహీ



నుల్ప్రవర్తింప మొదించు వేశ్యాపిశాచంబులఙ్ మెచ్చుకొంచూ కులస్త్రీలదూషింపు చున్నావుగా, శిష్టులీవేళ నీకాంతుప్రవేస్సారురా.

కామావధానులుగారు మనమతిరయంబున పోదమురండు.

జ్యోతిష్కులు.

సుబ్బావధానులు:— కామాశాస్త్రులుగారూ మీకును వర్తమానమువచ్చినది కాబోలును.

కామా:—ఏమిటండోయి వర్తమానమేమి ?

సుబ్బా:—సరిసరి మీకు తెలియదా! ఏమిటి కుంతలదేశమున వన్నెకెక్కిన జోశ్యులైయుండి ముఖ్యముగా రాజనగరులో ఏశుభకార్యము మీకు తెలియక జేయరే! యటలుండ నీదినమున దుష్టబుద్ధి కుమాత్రియగు విషయయను కన్యకకు వరుడుదొరికెనట. ఈదినమే ముహూర్తనిశ్చయము చేయుటకునతని పుత్రుండగు మదనుడు జ్యోతిష్కుల నందరీని సభకు వచ్చునటుల నుత్తరువు చేసియున్నవాడు.

కామా:—ఇపుడు జ్ఞప్తికి వచ్చెను. మీరును బయిలు దేరెదరా; రండు పోదము: మదనుడు (పిల్లకాకికి యేమితెలియురావింటిదెబ్బ అనునట్లు) ఈదినము ముహూర్తము చూడపోతే; యోగము మరణయోగము; వారము మంగళవారము; నక్షత్రమో భరణి కృత్తికలు బాగా

నేయున్నది. తిథి-చతుర్దశి-కరణము-మరణము-లగ్నము బృహస్పతి పంద్రెండింట-పాపులునాలుగింట- యేడింట పదింట ఇది యటులనుండనీ, శనిమాత్రము అష్టమస్థానమును వదలమనినను వదలడు. సరే-లగ్నశుద్ధి జూడబోతే ఈకన్యా జనకునకును సహోదరునకును భగ్నశుద్ధిగా నున్నది. మంచిది సుబ్బావధానులూ! తారాబలము చూస్తాము. పిల్లవాడి పేరేమిటోయి?

సుబ్బా:—సరి, సరి, మా భాగు, అష్టయితే యింటిపురోహితుడవు నీవే గదపోయి. పౌరోహిత్యం చేసుకోక రాజ్యాలు ఏలుతావా? యేమిటి? పెండ్లి కుమారుని పేరు మఱిస్తే విష్లోయి;

పేరా:—చంద్రహాసుడు గదపోయి.

కామా:—సరిసరి! వాసుదేవ! పేరుపెట్టినట్లుకుదిరిందే; తారాబలం-నామనక్షత్రం అశ్విని-ఈవేళకృత్తిక- తారాబలం మూడింట విపత్తార-దొందుదొందేరా. కొండప్పయనునట్లు ఆ లగ్నానికి యీతారా బలానికి అరున్నొక్కటి చెప్పేదానికి మారేమియు లేకయున్నది. ఇట్టి ముహూర్తములు పెట్టుటకంటెబండకట్టుకొనినూతఁబడుటమేలు ఇక కుక్షింభరులమై యుండు మనముఅన్నియుఆలోచన జేస్తూవుంటే మననోటగడ్డిపడుతుంది. కనుక మీరు శాస్త్రవాదముచేయక యూరకుండుడు. దుష్టబుద్ధి యూరక



లేడు. పెత్తనమంతయు మదనునిదే; మనకందఱికిని పెండ్లిలో గొప్ప బహుమతులుదొరుకును. మనదేమిపోయింది మీరూరకోండి.

[అందఱును పోదురు.]

మదనుడు చంద్రహాసునితో గూర్చుండును
విప్రులు ప్రవేశింతురు.

మద:—విప్రులారా! నాతండ్రి! యీలావణ్యాతిశయంబులచే నొప్పి సోముని ధిక్కరించు మోముతోనిందున్నయీనవమోహనాగునకు నాసహోదరియగు విషయనిచ్చితత్క్షణమె వివాహంబు జరుప నాజ్ఞ యిచ్చియున్నాడు. కాన మీరలు యోచించి శీఘ్రంబున ముహూర్తము నిశ్చయించుడు.

విప్రులు:—ఆర్యపుత్రా! యీదినము వివాహమునకు నెత్తిన దినముఇట్టి దినము తటస్థించుట మిగుల దుర్లభము. నీ చెలియలు మిగులఁ బుణ్యవతి కావున సుముహూర్తమె తటస్థమయ్యెను. ఇక పెండ్లికి వలయుసామగ్రుల సేకరింపుము. భేరీమృదంగాది వాద్యముల సిద్ధపఱుపుము. ఇక నాలస్యంబుచేయకుము. ముహూర్తమాసన్నమైనది.



పంచమరంగము - పడకటిల్లు.

విషయ - చంద్రహాసుఁడు.

చంద్రహాసుఁడు:—ప్రియసఖి! యేల యింకనిటుల బెదరెదవు?

కం॥ ఏమే యోమేచకకచ
యేమోవామేకుణామణీహేమఘృణీ
యేమేసోమేపమముఖి
యేమేమోమెత్తిచూడ-కిటులుందురటే.

సతీ! నీవేల యిటుల బలుకకున్నావు. అలరువిల్తుఁడు సూపు లచే నను భేదించుచుండ నీవిటుల జాగొనరింప దగదు.

కం॥ పచ్చనివిలుదొరపైపై
గ్రచ్చురవిరిములుకులేసి - కాఱియనిడుచో
మచ్చికననుబ్రోచుటకై
వచ్చిననాముద్దుగుమ్మ - వలతివిలెమ్మా॥

సఖీ! నీమనంబునం దెట్టి సందియంబున్నది? నిక్కముగా వివాహమైన తెఱువాత మనమిరువురానందముగా నుండవలసినతరుణమున నీవిటులుండ బాడియే?



కం॥ అలుకాపలుకవుమరువిరి
చిలుకారతిచేతిముద్దు - చిలుకాయలుకా
తొలికారుమేలిబంగరు
మొలికావలకాక ముట్టములకాయెగదే॥

సీ॥ పాలింద్లుకెంగేలఁ - బట్టనిచ్చినమేటి
కళుకుబంగరుగిండ్లు - కానుకిత్తు
వలపారననుజూచి - కిలకిలనవ్విన
బేరైనముత్యాల - పేరులిత్తు
దావినిద్దంపుకె - మ్మోవిముద్దొసగిన
సొంపురాణింపుబ - ల్కెంపులిత్తు
తళుకులేజెక్కుట - ద్దములంటనిచ్చిన
వెలలేనివజ్రంపు - బలుకులిత్తు

తే॥ పూలపాన్పున - వెలలేని - హాళినతను
కేళినోలాడజేసిన - లీలగ్రాల
మేనిసామ్రాజ్యమిత్తుని - వ్వేళయింత
గోలతనమేలనను నేలు - కొనవెబాల॥

ఉ॥ కూరిమిమీరనీకులుకు - గుబ్బలతొమ్మ్యులనానిసారెకుఁ
జేరికమోవిముద్దుగొని - చెక్కులుగీటికడుంగడిందిగొ
య్యారముజూపుకోపునెఱి - యఁమదిబాయడికేమిసేతు
నాహారిమణీ! మనోభవవిహారమణీమణిస్త్రీశిరోమణీ॥

ప్రియా! నీవిటులాలస్యంబు చేయు నామనంబు మదనుని వాడియమ్ములకునోర్చి కడుడస్సినది. ఇక మనము లోనికి బోదము రమ్ము:

విషయ:—ప్రాణనాథా! మగవారిని నమ్మదగునా; వారి పని తీఱువఱకు గోలలను వింతయు సంతసింపజేసి వారి మనంబుల నుగ అంతురు; ఆవల మొగమెత్తియైన చూడరు.

చంద్ర:—అటులనన్నన్నటికిని తెలువకుము; మగవారన్ననందఱునొక్కటియా లెమ్ము; లెమ్ము:

(లోన ప్రవేశింతురు)



## చతుర్థాంకము.

### ప్రథమరంగము - సత్రము.

పప్పు రామావధానులు ఒయ్యారం వెంకట్రావుగార్ల ప్రవేశము.

రామా:—ఓహో! ఒయ్యారము వెంకట్రావుగారా! పెండ్లియింటి భోజనశాలనుండియేనా రావడము.

వెంక:—ఔను; రామావధానులుగారూ! ఈదినమందు ప్రభువుగారింటి పెండ్లియే బాగుండును అనుకుంటే భోజనము మరింత బాగుగానుండింది; ఇట్టి భోజనము మీరెన్నడైనను తినియుందురా?

రామా:—(ఆయాసముతో) అవును నాయనా! ఆతిండియే నాకొంపగాల్చినది.

వెంక:—అదేమయ్యా! ఆలాగంటావు భోజనమెక్కువైనదా! యేమిటి, (మొగము చూచి) ఏమండీ! చాలా ఆయాసముగా మాట్లాడుతారే.

రామా:—ఆయాసమేటి నాయనా! ఊపిరి ఆడడము లేదు అబ్బా అయ్యో శంకరా! (గఱుమని తేపువిడిచి) అమ్మా! పొంగలి పులిహోగిరము, దద్యోధనము జున్నులు మీగడపెరుగులు వెన్నముద్దలు, ఒలుపుపప్పు, అప్పడాలు, వరుగు

లు, వడియాలు, దోసెలు, రొట్టెలు, నిప్పట్లు, అప్పాలు, అతిరసాలు, సుకియాలు, అమృతకలశాలు, పప్పుబూరెలు, సజ్జబూరెలు, వడలు, ఆనువడలు, ఒబ్బట్లుమనోహరములు, గారెలు ఇక చెప్పుటకు శక్యముకానియనేకవిధములైన పలహారముల భక్షించితిని.

క॥ ఆపప్పును బరమాన్నము
లాపూర్ణపుగారెబూరలన్నియుదినఁగ౯।
నాపొట్టచాలదాయెను
ఈపొట్టకు దోడికొక్కటేలకలుగదో॥

వెంక:—ఈయొకపొట్టయేయింతయుబ్బియుబ్బి బాధపడుచుండ మఱియొక పొట్టకూడా కావలెనా? అంతగానాయాసముంటేజిలకరపోచనమలకూడదా! అదిజీర్ణకారియైనదే.

రామా:—అయ్యో! జిలకరపోచపట్టేసందుంటే అక్కడరెండు మూడు గారెముక్కల నిరికించనా?

వెంక:—అంతయెక్కువగానేల పుచ్చుకొన్నావయ్యా?

రామ:—ఎక్కువేమిటి? గొంతులో వేలుపెట్టి తేగారెముక్కలుఅందుచున్నవయ్యా.

వెంక:—దొరగారిసొమ్ము తేరగా తినగానే సరియా హరించుకోవద్దా?

రామా:—చూస్తేవదలిపెట్టబుద్ధిఅవుసుందా గారెముక్కలను విరిచి భక్షించుచుండగానే పోళీలగంపవచ్చినది పోళీలు



మడతఁబెట్టి నేతిలోముంచుకొని గుటుగుటునకు మ్రింగుచుంటే గుబాలునక్షీరాన్నపు గుండిగవచ్చినది విస్తరిలో నింకా నాలుగు గారెముక్కలుండాగా వానిని నవతలకు నెట్టిక్షీరాన్నము పైబడితినిఅదిరుచిగా నుండుటచేత పెద్ద పట్టుపట్టినాను.

వెంక:—ఔనౌను; క్షీరాన్నము రుచిగానేయున్నది.

రామా:—రుచిచెప్పుటకు నలవియా? స్వర్గమునకు బెత్తెడెడముగా నున్నది. నామాటలకడ్డమురాక వినుడు క్షీరాన్నమురుచిగానుండుటచేత మజ్జిగనామాని వేసికొందామంటే నాప్రాణమునకు శత్రువువలె మీగడముద్దలతో గూడగడ్డపెరుగువచ్చి పడిందయ్యఅదివదలుటకుగూడనిష్టము లేకపోయినది ఇకనేమి చేతును.

(అని యాయాసముతో కూర్చొనును)

వెంక:—అదిగో అదే నీప్రాణములు తీసినది.

రామా:—ఆపెరుగునుజూడగానే నాయొడలు పెరిగినది; మనసు కఱిగినది; వివేకముతరిగినది; అంతటనేమియుదోచకనొక గొప్పపని చేసితిని.

వెంక:—ఏమిపని చేసారండోయి.

రామా:—బల్లులటుఇటు సాగదీసుకొని యుద్ధముబస్తాను నుకలించినట్లుఒక్కసారి యెగిరి కూలబడినాను; దీనిచేతలోప

లకొంచెము సందిచ్చినట్లుకనబడినది; అప్పుడొక్కవాయి పెరుగన్నము కలిపి నాలుగుముద్దలుగ జేసి పందికుక్కకు అన్నమెత్తినట్లు గొంతులోబడ వేసినాను.

—ంం❋ంం—

## ద్వితీయరంగము.

### దుష్టబుద్ధినగర ప్రవేశము.

దుష్టబుద్ధి:—ఆహా! యేమియాశ్చర్యము కుంతల నగరంబునం దెచ్చట గాంచినను మందిరంబులలంకరింపబడివీధులలో బ్రముగ్గులు బెట్టి తోరణములుకట్టబడియున్నవి రాజవీధిలో చలవపందిళ్ళు వేయబడి యున్నవి.

(ఊరిదగ్గఱ సర్పమొకటి పొడజూపి మనుజభాషలతో) దుష్టబుద్ధి నీయింటియందలి ధనంబునుగాపాడుచుండిన సర్పమును ఇకపైనీధనంబు అన్యులపాలగును.

[మఱువై పోవును.]



ఆ! ఏమిది పోయిచూచెదము: నిక్కముగా! రాజునాకుదెలియకుండా తనకుమాత్రెకుఁ బెండ్లిచేయునా? ఎక్కడిమాట? అటుల జరిగించియుండిన యెడ నామా యోపాయంబులచేనాతని చీకాకుపఱచి యమలోకమునకు నంపకపోదునా? అంపకపోయిన దుష్టబుద్ధియనునాపేరు సార్థకమగునా? ఈసత్రంబుచెంత కొందఱు విప్రోత్తములు భుక్తాయాసంబుచే కదలమెదల నేరక క్రిందబడి పొరలాడు చున్నవారు. అయ్యో! యీబ్రాహ్మణుల కెంతయాశ.

(ప్రకాశముగా) విప్రోత్తములారా! మీదేయూరు ఈనగరంబున మీకిట్టితృప్తికరమైన భోజనం బిడినవారెవరు? వారియింటఁ బ్రయోజనంబేమి?

విప్రులు:—స్వామీ! ఏమో తెలియనివారివలె మమ్మడుగుచున్నారు. మీకొమార్తె విషయను చంద్రహాసుని కిచ్చి పెండ్లి చేసిరి.

దుష్ట:—ఆహా! యటులనా? ఈ బాపల్లు చెప్పినది నిజమా? విప్రోత్తమా! చక్కగా చెప్పుము. నాకుమార్తె యగు విషయనా? ఎవరికి? చంద్రహాసునకా? సహాబాప్!తఱువాత; తఱువాత.

విప్రులు:—ఇకతఱువాత యేమిమాచాతిఅన్నము పడియాత్రాతకు తెచ్చినది.

—•●•—

దుష్టబుద్ధి గృహప్రవేశము.

దుష్ట:—ఆహా! (అన్యథా చింతితం కార్యం దైవమన్యత్ర చింతయేత్) అనునట్లు నేనొకటి తలంచిన, దైవ మొకటి తలంచెను;

ఔరౌర! యిట్టిపుత్రు డుండియేమి లేక యేమి.

(ప్రకాశముగా) సేవకా; ఇటురమ్ము: నీవతి వేగంబున బోయి మదనుని బిలుచుకొనిరమ్ము.

మదన ప్రవేశము.

మదన:—తండ్రీ, నమస్కారము.

దుష్ట:—మదనా, నీవిట్టిపని జేయతగునా! పితృవాజ్ఞమీరినడచిన పుత్రునికి రౌరవాదినరకంబు ప్రాప్తించునుకదా! నీవెట్టిపని చేసితివి; దుష్టా!

మదన:—తండ్రీ! మీమాటను దాటనివాడను గాను; మీరు వ్రాసినట్లే జరిపించితిని.

దుష్ట:—పుత్రా! యాదవకులంబునకు ముసలంబుబుట్టినటుల, నాకడుపుచెడబుట్టితివిద్రోహీ! నేనునీకువ్రాసినజాబును దెమ్ము:

మదనుడిచ్చును:—దుష్టబుద్ధిపై రెండుపద్యముల జదువును.



(ఆశ్చర్యముతో) ఏమీ! నేనిట్లు వ్రాసితినే; నిజముగానిదంతయు నేను వ్రాసినదే ఎంతపొరపడినది. (మదనుం జూచి) సరి! యికనీవుపొమ్ము (తనలో) ఏదైన నొక యుక్తిం జేసి చంద్రహాసుని జంపవలయును.

(సేవకుని బిలిచి) సేవకా! నీవు శీఘ్రమంబున నేగి తలవరియగు సేనుని బిలుచుకరమ్ము:

సేనుడు వచ్చును.

సేనుడు:—ప్రభో! నమస్కారము.

దుష్ట:—సేనా! నాయానతిని శిరసావహించి; నేనుడివిన ప్రకారము నీవు చేసితివేని నీకు గొప్ప బహుమతి యిచ్చెదను.

సేనుడు:—అటులనేకానిండు.

దుష్ట:—సేనా! రాత్రియందు పూజా ద్రవ్యములతో అంబను దర్శించుటకై విచ్చేయు మనుజుని నీవేమియు విచారింపకయే శిరమును ఖండించి యమసదనంబున కంపుము; ఈసంగతి. నితరులెఱింగిరేని మన కపాయంబు సంభవించును; కావున నతి రహస్యముగా జేయవలయును పొమ్ము:

(తనలో) ఇక నేననుకొన్న ప్రకారము వీడు తప్పక నెఱవేర్చును; నేనిక నాకుమార్తె యంతి పురంబునకేగి చంద్రహాసుని కాళికాలయంబున కనిపెద.

చతుర్థరంగము - విషయాంతఃపురము.

దుష్టబుద్ధిప్రవేశము.

చంద్ర:— ప్రియే యేలనటుల సంకోచించెదవు; ఎవరికైనని వట్లు బెదరెదవు?

విషయ:—ప్రాణనాథా! మదీయ జనకుండగు దుష్టబుద్ధి యే రాజ్యంబునకో యేగి యపుడు మనముండు మందిరంబునకు విచ్చేయు నట్లున్నదిగాన; మనమిరువుర మాతని కెదురుగా నేగి వందనంబు చేసి మర్యాదగా బిలుచుకొని వత్తము లెండు.

దుష్టబుద్ధికి చంద్రహాసుడు విషయయిరువురువందనము చేతురు:

చంద్ర:—మాతులా! నమస్కారము.

దుష్ట:— కల్యాణీ; చంద్రహాసా!

చంద్ర:-ఆర్యా! దేవరవారికృపవలన నేగదా నాకిట్టిపదవికి లిగినది.

దుష్ట:— అంతయు దైవానుగ్రహమువలననే;

విషయ:— పితా! నమస్కారము.

దుష్ట:—కల్యాణీ; విషయా!

విషయ:— తండ్రీ! యింతకాలమునన్ను గారాబముగా బెంచి, నావివాహకాలమపుడు మీరు లేకుండ పోతిరి. అది నామనంబునకు మిగుల కొఱతగానున్నది.

దుష్ట:—పుత్రీ! నేనేమిచేయుదు నేనుబోయినరాచకార్యంబులు నెఱవేఱనందున; నాకక్కడనిలువవలసినచ్చెను; నేనింమ లేక పోయినను, మదనుడు వివాహంబునుజక్కగనే నెఱవేర్చెను.



దుష్ట:— కమాసు - ఏకతాళము.

అరుగవలయు-నార్యపుత్రి- యంబికాలయంబునకు॥ అ॥
అర్చన- లొనర్పుమయ్య-యఖిలశుభములొందగ॥అ॥
నిశీదవేళనేగుమీవు- ఈశ్వరినిభజింపను॥ అ॥
ఇదియునాకుసమ్మతంబు-నిజముగానొనర్పుమా॥ అ॥

చంద్రహాసా! మాకులాచారప్రకారము వివాహమైన పది దినముల లోపల మాకుల దైవమగు అంబికను అర్ధరాత్రివేళ బెండ్లి కుమారుడు పూజాద్రవ్యంబులతో నాలయంబున కేగి దేవిని అర్పించి రావలయును; గాననీవు నాప్రకారగమే యీదినము పోవలయును సుమా?

చంద్ర:—ఆర్యోత్తమా! దమయానతిని శిరసావహించి యీ దినముననే యర్ధరాత్రివేళనంబను దర్శింపబోయెద.

దుష్ట:—నేనుపన్నిన యుక్తిమంచిదే; అయితే నాకుండు నొకపుత్రియగు విషయ దురవస్థను బొందును; ఏమిదురవస్థ;—వైధవ్య మేగదా! అయిననేమి? ఇతనిని ప్రాణముతోనుండ నిచ్చిన మదనునకు నీకుంతల నగరంబున గాలు పెట్టుటకైన సందుదొరకునా? ఇక వానిపనియల్లాటమేకదా! వీనినిక మట్టుపెట్టక విడవరాదు.

---

## ప్రథమరంగము - కుంతలరాజుసభ.

రాజు:—సచివాధీశా! నిన్నటిరాత్రి నేను సుఖనిద్రం జెందియుండ నిజముగా దనువునీడకు తల గానరాదయ్యెను. ఇట్టి స్వప్నంబు కలుగుటకు నేదైన యొక కారణముండును; గాలవా! మీరు నాపై దయయుంచి, నరిష్టలక్షణం బెఱింగింపుడు.

హిందూస్తాని తోడి - ఆదితాళం.

వినుడిక - నాకల - వినిపించెద॥ వి॥
నిన్న రేయినిద్రింపగా - కానకైతినాశిరము
మనజాలభువినింక - మరిమరి వెతనొంద॥ విను॥
ప్రేమతో బెంచినట్టి - ప్రియపుత్రికకు నేను
పరిణయ మొనర్పను - ప్రాలుమాలితనహా॥ విను॥

గాలవుడు:—వసుమతీనాథా! వినునీవుచింత్తలనొందకు. మదిని స్థిరపఱచుకొమ్ము; స్వప్నఫలంబులనన్నియు వివరించెద.

సీ॥ ధ్రువవసిష్ఠారుంధ - తులఁదనుచ్ఛాయయు
గాననివాడేటి - లోనగడచు
గిరీశాన్వితాగ్నిని - షిర్కు-ణార్కు-ఁగనువాడు
మడియునేకాదశ - మాసములను



బనిలేనిపనిబక్క- - బలిసినబాసుకచి
క్కి-నవాడుదెగునెల - లెనిమిదింట
నడుగుచోప్పునఁబార్ష్ణి - యైనవ్రేళ్లైనఖం
డితమైనవాడేము - న్నెలలదప్పు
గీ॥ గాకియైనగ్రద్దైనను - లూకమైన
నెత్తిసోకినవాడాఱు - నెలలగడయు
స్నానమర్దనవేళల - మేనిచర్మ
మదరువాడైదునెలలకు - వంతరించు॥

క॥ తనసీడవేఱయొకలా
గుననుండినవాడు నాల్గునెలలకునీల్గున్
ఘనరహితమైనమెఱుపుజ
మునిదెసగనువాఁడుత్రెళ్లు - మువ్మాసములన్॥

క॥ తనబింబమద్దమునఁజూ
చినఁదలలేకున్నవాడు - చెల్లునురెన్నె
ల్లనుదనతనువుగమరుదల
చినపక్షములోనవాడు - జీవముతొలగున్॥

గీ॥ జలకమాడినవయవ - ములకుమించి
హృదయమధ్యంబునుజ్జిహ్వ- యెండెనేని
నీరుగ్రోలినదాహంబు - నిలువడేని
వాడువేంచేయునీరైదు - వాసరముల॥

క॥ మనుజులలోఁ జనములలోఁ
దనరూపముగానకున్న - దనవీనులలోఁ
ననుఁ బ్రేళ్ళుపెట్టిమూచిన
ధ్వనివినబడకున్నవాఁడ - తడయకపొలియున్ ॥

సీ॥ ఋక్షవానరముల - నెక్కి పాడుచుఁ దాన
కాలునిదెసకేఁగ - గంటిననియు
దనమూర్ధమునబొగ్గు - లునుశిరోజంబులు
నుముకయుభక్షించు - చుంటిననియు
నగ్నుఁడై జైనసన్న్యాసి - నవ్వుచుబ్రోల
గంతులువేయంగ - గంటిననియు
శైలమూపాదమస్తమునందు - వడియంగ
నుర్విపై నిద్రించు - చుంటిననియు
గీ॥ నతిభయంకరమూర్తులై - యస్త్రధరులు
తాలఁగొనిఉవ్విరనియును - నీలిచీర
కాంతబడిదక్షిణమువోవ - గంటిననియు
స్వప్నమునగన్న వారికి - జావుధ్రువము॥

ఇట్టిస్వప్నంబులంగనిన తప్పక మరణంబు సంభవించునుకావున,

చ॥ జనవరయిట్లరిష్టములు- సంభవమైన గురుద్విజామరా
ర్చనజపహోమదానముల- శాంతియొనర్తురులేక సర్వసం
గనిరసనంబు నింద్రియవి-కారము జేయుచు నీదునీరుగూ
ర్చినగతిజీవునింబరము - జేర్తురుతత్త్వ రహస్యకోవిదుల్ ॥



ప్రభో! మీరలింకనీరాజ్యమునందును, ధనకనక వస్తువాహనములందును గల యాసనుగోసి, యివియిన్నియు స్థిరంబులుగావని మనోనిశ్చయంబుచేసికొని, ఈరాజ్యమునందు మీకువిక్షేపములు లేకుండ, తగునేర్పాటులుజేసి, విరక్తిమార్గంబున తపంబుచేయుటకు వనంబున కేఁగుటమేలు.

కుంతల:—మంత్రివర్యా! మీరువచించిన ప్రకార మొనర్చుటకు సిద్ధుడనైయున్నవాడను. అయినను నాస్వాంతంబున నొకవిషయంబు దురంతమైన సంతాపంబు కలిగి వెతజెందించుచున్నది; నేనేమిచేయుదు:

గాలవ:—రాజోత్తమా!మీబోటివారిట్లు కొందలమందపాడియే? యట్టిసంతాపమునకు గతంబెయ్యది యానతిండు.

కుంతల:—వ్యసనపడుటకు గారణము మఱేమియున్నది. గారాబముగాపెంచిన నాముద్దుల పట్టియగు జంపకమాలిని తగినవరునకిచ్చి పెండ్లిచేయకపోతిననే వ్యసనమొక్కటియే;

గాలవ:—ప్రభో! మనపురంబుననే సకలవిద్యా పారంగతుడును, సకల సల్లక్షణ సౌకుమార్యుండును, బుధజనవిధేయుండును, సాహసాది గుణంబులచే వన్నెకెక్కి, నున మంత్రిపుత్రికయగు విషయను బెండ్లాడి యీనగరంబున మామగారింటనే యున్నవాడు; అతడు మీకుమాత్రెకు తగినవరుడు; మీరుయోచింపక మదనుని

బిలచి చంద్రహాసుని బిలిపింపుము. వివాహమునకు వలయువాటిని త్వరితమ్ముగ నాయత్తపఱుపుడు.

కుంతల:—మదనా! నీవు శీఘ్రంబునబోయి, మీసదనంబున నున్న యింద్రుని ధిక్కరించు వదనంబునుగలిగి యింపొందు చంద్రహాసుని త్వరితమ్ముగ నాయాజ్ఞనుదెలిపి తోడితెవ్ము; అతనికి నాకుమార్తెయగు చంపకమాలి నినిచ్చి పెండ్లిచేయ నిశ్చయించుకొంటిమి; కావున నతని నతిరయమ్ముగఁ బిలుచుకొనిరమ్ము:

కానడ - ఆదితాళము.

సందియమొందక - చనుమికమదనా - చంద్రహాసునినీవు - సరగునగొనిరమ్ము॥ సంది॥

నాప్రియపుత్రిని - నాతని కేయిచ్చి - యీధర నేలగ - రాజుగ జేతును

మేలగుగుణముల - మించినవాడట - పాలన జేయును - పాడిదప్పక పృథ్వి॥ సంది॥



ద్వితీయరంగము.

చంద్రహాసుడు కాళికాలయంబునకు బోవుట.

చంద్ర:—

గీ॥ పంకనిర్మగ్నమగుగోవు - బరికరించి
సుకరముగనుద్ధరించుగో - పకునిమాడ్కి
ముదముదైవారనుద్ధరిం - పుమువుకాక
పంకనిర్మగ్ను - నన్నుగోపాలతిలక॥

మ॥ కరుణాపూరిత నేత్రదారుణరణ - క్షామానిర్జర శాత్రబం
ధురసాలద్రువ చైత్రనిర్దళిత - శత్రుక్షేత్ర రామాధిభూ
వరచారిత్రనిరంతకోత్సవరణ - ద్వాదిత్రరామాసముత్క
రసమ్మోహనగాత్ర - విశ్వజగదేకచ్ఛత్ర భాగ్యోన్నతా॥

తోటకము॥ వారణ వారణ - వారణరక్షా
సారససారస - సారస పక్షా
శారదశారద - శారదకీర్తీ
హారిమహారిమ - హారిసుమూర్తీ॥

దీనదయాళో! నిన్నునమ్మినవారి కెన్నటికిని కొదువరాకయెల్లపుడును కొల్లలుగసిరులనిచ్చి బ్రోచుతండ్రివి నీవేగదా!

మదనుడు:— బావా! యెచటికీ నొంటిరిగా బరివార మేమియులేక పోవుచున్నావు; వాహనంబులేక యిటులఁ

బాటసారివై యింత యవసరంబుగా నీనిశీథ సమయంబున ఫలపుష్పంబులం గరంబులం దిడుకొని పోవంగ తంబెయ్యది ?

చంద్ర:— మదనా! ఎచ్చటికా; నీదుజనకుండు నన్నిప్పుడే కాళి కాలయంబునకు అంబను నర్చించి రమ్మనుమని యాజ్ఞయిచ్చెను; గాన నేనిప్పుడే కాళికాలయంబునకు బోవుచున్న వాఁడు.

మదన:—బావా! నీకొఱకై నేనెన్ని చోట్ల వెదకితిని; ఆడబో యిన తీర్థమెదురైనయట్లు నిచ్చటనే కనఁబడితివి.

చంద్ర:— ఏలనీవటులనాకై వెదుకవలయును. అట్టియగత్యమైనపని నాతోనీకేమి కలిగినది.

మదను:—

మనుజాధినాథుడు- నిన్నుపనియుగలిగి పిలువనంపె॥మ॥
విమలచరితుడంచునృపుడిపుడు వెదుకబంపెనన్ను॥ మ॥
అరిగెదనిపుడంబికకును - అర్చనలొనర్చుటకును॥మను॥
అనుమానమేటికినీకు-ఆర్యపుత్రయేగుమయ్యా॥ మను॥

బావా ! కుంతలనగరాధీశ్వరుఁడు నిన్నుద్వరగాదనసభకుఁబిలుచుకొని రమ్మనుమనిపంప నేనువచ్చితిని.

చంద్ర:—మదన! ఈవసుమతీనాథునకు నాతోడనేమిపనియున్నది; ఏమిచిత్రముపరిహాసించెదవా!

మద:—బావా! నీవటులనెన్న బోకుము; నిన్నుగాంచగోరికుంతలాధీశుడు నిండుకొలువై యుండినన్ను బిలిపించినీకై పంపెను.



చంద్ర:— అట్లయిన వేగముగనే బోయెద.

మద:— నీకుమాఱుగానేను ఫలపుష్పంబులం గొనిపోయి యర్చించి వచ్చెద;



తృతీయరంగము - కుంతలరాజుసభ.

కుంతల:— గాలవా ! చంద్రహాసునకై యేగినమదను డింక నురాడాయెనే! ముహూర్తంబు సమీపించె; నిందు కేమి చేయుదము:

గాలవు:— రాజోత్తమా! చింతింపకుము, మదను సామాన్యుఁడుకాడు; వివేకవంతుడును వినయవిధేయతలచే నెల్లవారియుల్లంబుల నుల్లాసంబుచేయుచు దుష్టబుద్ధికన్న నెక్కుడైయున్నాడు. అతండెట్టులైన చంద్రహాసుని బిలుచుకొని వచ్చును.

సేవకుడు:— ప్రభో ! మనహజారముకడ మంత్రిపుత్రుడును ఎవరో యింకొకరును వచ్చియున్నారు; సెలవైనబిలుచుకొని వచ్చెదను.

కుంతల:—గాలవా ! అతనిసౌందర్యమును గాంచుము. ఈరూపమీపటుత్వ మీరేఖావైవభ మీనెఱప్రాయమును చూడ, పదివేల మన్మథులొక్కటిగా నుదయించినటుల

తోఁచుచున్నది. ఇట్టిమహానుభావుఁడు నాకల్లుఁడగుట నేతొలిజన్మంబునందొనరించిన పుణ్యఫలంబెకాని వేఱుకాదు.

చంద్ర:—ఆర్యా! వందనము చేయుచున్నాఁడ.

కుంత:— కల్యాణీ! సుకుమార సుందరా.

చంద్ర:—భూసురోత్తములారా! మీకందఱికిని వందనము.

గాలవుఁడు:—(తనలో) ఆహా: యీసుందరాంగు నకునందఱికిచ్చునట్టి యాశీర్వాదంబుగాక మహదాశీర్వచనంబు చేసెదచంద్రహాసా! నీకష్టైశ్వర్యంబులు కలుగుఁగాక.

సీ॥ శ్రీరస్తు శుభమస్తు - వీరస్తు విజయోస్తు
పుత్రరంజనమస్తు - పుణ్యమస్తు
ధనమస్తుదాన్యమ - స్త్వవ్యనవద్య సుఖమస్తు
చిరతరసంకల్ప - సిద్ధిరస్తు
సత్యమస్తుమహోస్తు-శౌర్యమస్తుయశోస్తు
స్వస్త్యస్తు సుగుణోస్తు - శక్తిరస్తు
సామ్రాజ్యమస్తుశా - శ్వతధర్మఫలమస్తు
వృద్ధిరస్తుమహా - ప్రసిద్ధిరస్తు

గీ॥ జ్ఞానమస్తు శ్రియఃపతి - ధ్యానమస్తు
గురుచరణ భక్తిరస్తు-సత్కుశలమస్తు
శాంతిరస్తు నిరంతరైశ్వర్యమస్తు
భాగ్యమస్తు మహాసార్వ - భౌమనీకు॥



చంద్రహాసా! నీగుణాతిశయంబులు నేనువిని బహుకాలముగా నినుగాంచగోరియుంటిని నేటికినిన్ను కనులారఁగాంచితి.

కుంతల:—రాజనందనా! నేనునీకీర్తినివినిమెచ్చి నాముద్దులపట్టియు సకలసల్లక్షణ పాలికయు, మృదుమధురభాషిణియు నగుచంపక మాలినొసంగి వివాహంబుచేసి, యీరాజ్యంబునకు బట్టాభిషిక్తునిజేయ నిశ్చయించి పిలువనంపినాఁడ.

చంద్ర:—ఆర్యా? దేవరవారియిష్టప్రకారమేజరిపించవచ్చును.

కుంతల:—వివాహంబు; చంద్రహాసా! ధర్మంబుదప్పక పరిపాలనజేయుచు నీకుంతలదేశంబును పరిపాలించుము,అదియునుంగాక.

కమాసు - ఆదితాళము.

సుకుమారధీర - సుందరాంగిమీద - జూపుమాకరుణకో
పగించకుము॥ సుకు॥

మానిని యెప్పుడు మరియాదలోన - గానక చేసిన గావు
మయ్యనీవు॥ సుకు॥

ఏకపుత్రియని యెంచిస్వాంతమున - పెంచినవాడనుప్రేమ
తోడనేను॥ సుకు॥

నాకేకపుత్రికయునాప్రాణధనమైన నీపుత్రికయేనైన తెలియక చేష్టలబాల్యచేష్టలచేఁ దప్పిదము లొనరించెనేని క్షమించుము.

చంద్ర:—

కమాసు - రూపకతాళము.

ఏలమీరలిటుల వెతకు - బాలికకై పడగనేలా॥ ఏల॥
సీతనూజమీదకూర్మి - నెపుడువిడువనయ్యానమ్మ॥ ఏల॥
మదినికలత మానుమయ్యామరువనెపుడు మాన్యచరిత॥ఏల॥
మోదముతోనుండుమికను - బేధమెంచకయ్యానాపై॥ఏల॥
(వివాహము.

కుంతలరాజు - చంపకమాలిని.

కుంతల:—అమ్మా? చంపకమాలినీ, నీకునేఁదెల్పునీతులనెన్నటికిని మఱువక భర్తయేప్రాణదైవమని యెంచవలయును.

చం॥ పతిహితభక్తిచే వెలయు - పద్మదళప్రతిమాననేత్రకుఁ
వ్రతములుసోకులేటికిధ్రు-వంబుగఁబుణ్యములబ్బునెప్పుడుఁ
బతిని దిరస్కరించిపర - భర్తలఁజెందిన భామపుణ్యముల్
గతజలసేతుబాధములు - గావెవచింపగ నెంతనోచినన్.

క॥ లలిజాగ్రత్స్వప్నసుషు
ప్తులనుమనోవాక్కాయక - ములచేసివేఁ
గలనైనసతులుపరపురు
షులగోరినవన్నెలేదు - సూవెధరిత్రిన్॥

క॥ పతిసేవయె భూషణములు
పతిసేవయె జీవనంబు - భామామణికిన్
బతిసేవయె సువ్రతములు
పతిసేవయె యిహముఁబరము - భాగ్యములుసుతా॥



బాలికామణి —భర్తనెదిరింపఁజనదు; ఇకను దెలిపెదవినుము: కుమారీ; భర్తను:

ఉ॥ కేరగరాదునవ్వి గిలిగింతలు - పెట్టగరాదుచెక్కులంఁ
జీరగరాదు గుబ్బలుక - చిక్కున గ్రుమ్మగరాదుకేళిలోఁ
మీరగరాదుపైకొనిర - మింపగరాదుకళారవంబులిం
పారగ సల్పరాదు- మదిరాక్షులు భర్తలగూడు వేళలన్॥
పుత్రి? భర్తయూరియందు లేనపుడు.

చం॥ అలకలుదువ్వరాదు సరసాన్నముల్ భుజియింపరాదు
మైకలపములందరాదు తిలకంబురకంబుగదిద్దరాదుసొ, మ్ము
లుగయిసేయరాదుసుమముల్ ధరియింపగరాదుసాధ్వియా
నలినదళాయతాక్షికిని నాధుఁడు చెంగటలేని వేళలన్॥

పుత్రికామణీ? ఎందరోపుణ్యవతులు తమపాతివ్రత్య మహిమచేవారికీర్తిదిగంత విశ్రాంతంబై యెల్లవారును మెచ్చుకొనందగిన వారైయున్నారు. అమ్మా! సావిత్రీదేవి,అనసూయ, అహల్య, ద్రౌపది, తార, మండోదరి, సీత, మొదలైన పుణ్యవతుల చారిత్రంబులు విననెట్టివారికైనను వారుచేసిన పాపంబు మొదలంటబోయి పుణ్యంబువచ్చునని పెద్దలువక్కాణింతురు.

గీ॥ ఉక్కుఁగుగ్గిళ్లనుడికించె - నొక్కసాధ్వి
ఒడయనికిఁబ్రాణమిప్పించె - నొక్కసాధ్వి
నాధునికిఁగన్నులిప్పించె - నాతియోర్తు
ఎందరోపుణ్యావతులుండు- గీధరణిని॥

అమా:—నీవునట్టి పుణ్యావతులవలెనే నాధుడేదైవంబనినమ్మియుండుము.

శ్లో॥ కార్యేషుదాసీ - కరణేషుమంత్రీ
రూపేచలక్ష్మీ - క్షమయాధరిత్రీ
స్నేహేచమాతా - శయనేచవేశ్యా
షట్కర్మయుక్తా - ఖలుధర్మపత్నీ.

అనునీతివాక్యంబీ వెఱింగినదేకదా ! కనుకనీవు నీప్రియుని మనంబున కానందంబు కలుగునటుల నడచికొమ్ము:

---

## చతుర్ధరంగము.

### కుంతలరాజువానప్రస్థుడగుట.

కుంతల:—గాలవా? నాకుండునేకపుత్రిని చంపకమాలిని పెద్దలుపచించురీతిగా!

క॥ శ్రీయునుగులమును రూపముఁ
బ్రాయము శుభలక్షణంబు - బాంధవవిద్యా
శ్రేయముగల వరునకుఁగ
న్యాయుతుగా జేయవలయునధిక ప్రీతిఁ॥

అనునటుల రూపయౌవన సంపన్నుఁడును-విశుద్ధకులసంభవుండునునైన చంద్రహాసునకిచ్చి వివాహంబుగావించి నారాజ్యమునంతయు నాతనిస్వాధీనంబుచేసితిని; ఇక నామనంబునందెట్టికొఱతయులేదు; ఇక దారేషణ పుత్రేషణ ధనేషణంబులను నీషణత్రయంబులంజిక్క;

కామక్రోధశ్చ లోభశ్చ దేహేతిష్ఠంతి తస్కరాః
జ్ఞానరత్నాపహారాయ తస్మాజ్జాగ్రతజాగ్రతః॥

మనము యోచించిచూడగా స్థిరమైన పదార్థ మీలోకంబున నెదియుగానరాము:

క్షణంవిత్తం క్షణంచిత్తం క్షణంజీవితమాయయోః
యమస్యకరుణానాస్తి తస్మాజ్జాగ్రత జాగ్రతః

మాతా నాస్తి పితా నాస్తి నాస్తి బంధుసహోదరాః
అర్థం నాస్తి గృహం నాస్తి తస్మాత్ జాగ్రత జాగ్రతః॥

గాలవా:—నిక్కముగా యోచించి చూచిన నీఘటములోనుం
డి ప్రాణములు వెడలిపోవునపుడేమైనను వెంటవచ్చునా?
అర్థాగృహే నివర్తంతి శ్మశానే మిత్రబాంధవాః
సుకృతం దుష్కృతం చైవ గచ్ఛంతమనుగచ్ఛతి॥

అనురీతిగా జీవుడొనర్చిన పాపపుణ్యంబులు తప్పనింకేమియు వెంటరావు; మనుజజన్మమెత్తుటయే దుర్లభము. అట్టి దుర్లభమైనమానవ జన్మమెత్తియును పుణ్యంబును సంపాదింపక పోయెనేనితుమ్మెదలు తేనెను జేర్చిపరులకర్పించు రీతిగానగును.

గాలవు:—రాజోత్తమా? ఆలింపుము.

దుర్లభం నరజన్మానాం వివేకమతిదుర్లభం
దుర్లభం విష్ణుభక్తానాం జ్ఞానీత్రైలోక్యదుర్లభం॥

కావున ఇట్టిమానవ జన్మమెత్తినపుడే జన్మసాఫల్యత చేసికొనుటకై నారాయణధ్యాన పరాయణుండై విష్ణుభక్తుల సదాపూజింపుచు.

శ్రవణం కీర్తనం విష్ణోః స్మరణం పాదసేవనం
అర్చనం వందనం దాస్యం సఖ్యమాత్మనివేదనం॥

అను నవవిధభక్తులచే నారాయణ చరణారవిందంబుల ధ్యానించి.



పునరపిజననం పునరపిమరణం పునరపిజననీ జఠరేశయనం
ఇహసంసారే బహుదుస్సారే కృపయాపారే పాహిమురారే॥

అనునీవిధంబున కులాలక చక్రమువలె నెడతెగకపుట్టుచు గిట్టుచుగర్భవాసాది నరకము లనుభవించుచు శ్రమలను బడుటకన్నస్థిరమైన సాయుజ్యంబునుబొందుటకై యత్నింపవలయును.

కుంతల:—గాలవా? యీ దేహమన్ననో "అమేధ్యపూర్ణం క్రిమిజాలసంకులం" అనురీతిని నసహ్యమైనది ఇదిస్థిరమనిమూఢులునమ్మి విశేషంబుగ భూషించుచున్నారు: పరికించిచూచిన యెడల దేహమునకును ఆత్మకును సంబంధములేదు అట్టిచో భార్యా పుత్రులకును దనకునెట్టి సంబంధముకలదు. కాలమాసన్నమైన యెడ నొకరికొకరికి సంబంధములేక తెరువరులవలెను, సంతకూటమివలెను వారివారిత్రోవల వారువారు పోదురు.

ఎట్లులన:—

ఇదం కాష్టం మిదం కాష్టం - నదీతీరేచసంగమే
సంయోగాశ్చ వియోగాశ్చ - కాతత్రపరివేదనా॥

అనురీతిని

భార్యాజలూకే సహజావిగర్తేపుత్రాదిమత్స్యేగృహబాడబాగ్నే
ఆశాతరంగే భవసాగరాణాం మగ్నం సముద్ధారయ చక్రపాణే

ఈసంసారమనెడిసముద్రంబున, ఆశయనెడియలలును, భార్యయనుజలగయు తోబుట్టువులనుసుడియు, బిడ్డలను చేపలును,

ఇల్లనెడి బడబాగ్నియుకలదు. ఇట్టిసముద్రమునుండినన్ను నావలిగట్టుకు జేర్చుమని భగవంతుని వేడవలయు.

గాలవా? నేననేకసంవత్సరంబులు రాజ్యపాలనంబుచేసి సకలైశ్వర్యయుతుఁడనై సకలసుఖంబులననుభవించితిని; (సంసారంసాగరందుఃఖం) అనిపెద్దలువచించురీతిని నీపాడుసంసారము దుఃఖభోజనంబే కాని సుఖదాయకంబుకాదు; ఇందెన్నాళ్లుండినను ఫలమేమియుగానము; నేనిప్పుడేబయలుదేరి యరణ్యంబునకుబోయి, వానప్రస్థుఁడై యుండి, పరమేశునియందు మనంబుగీలిచియన్నాహారముల విసర్జించి నిశ్చలతత్వంబునుసాధించి రమాధినాథు పాదకమలంబులఁజేరెద; ఈరాజ్యంబును చంద్రహాసుఁడు ధర్మముతప్పక పరిపాలింపఁగలడు; అతండెంతనిపుణుఁడైనను నీవునపుడపుడు సహాయుడవై యుండిరాచకార్యంబులజరుపుచుండుము నేఁబోయివచ్చెద.

(నిష్క్రమించును.)

---

## పంచమాంకము.

### ప్రథమరంగము.

మదనుడు కాళికాలయంబున కేగుట

మద:—ఆహా? యేమి; నాయెడమకన్ను భుజము మిక్కుటము గానదరుచున్నదే; దేహముకారణంబులేక వణకుచున్నది; మార్గముననెదురుగా చెవులపిల్లివచ్చుచున్నది; గుడ్లగూబలు గుండ్రలుపుచున్నది; నక్కలుగుంపులు గుంపులైత్రోవ కడ్డమువచ్చుచున్నది; ఇట్టిదుశ్శకునములు నాకేకకాలంబునఁ గలుగుటకు కారణంబేమి ? నాకీనగరంబున శత్రువొక్కఁడును లేదు; అయిననిట్టిదుశ్శకునములు కలిగినముప్పు తెప్పున వాటిల్లకతప్పదు; దైవాధీనము; మనచంద్రహాసున కిట్టిబెడదలు తప్పెనుగదా; అయ్యో? యందునొకటైన శుభశకునంబు కనుపట్టదయ్యెను; అమ్మా! భగవతీ! త్రిలోకజననీ నాకెట్టికష్టంబును రానియ్యకకావుము.

(అనిపోవుచుండును.)




---

## కాళీకాలయము.

హంతకులు:—ఒరేలన్నా? అడసూడు ఏందోసేతిలోపెట్కోని సీమాజామా యేస్కొని దేవళానికి మాసివస్తావుండావుండాడ్ లెండ శేయ్?

[కత్తియెత్తుకొని]

ఏరన్నా? యేండోయిఆశిన్నకుఱోడు రూపసిగానుండాడువానిచంపడాన్నికి చేతులెట్లా వొచ్చునోయి.

నాగన్న:—ధూత్తరి పిరికిబంటా? మీపురాండాలను రామాండాలను కట్టిపెట్టేయ్; మనయేలినవారి పనినిమనమనుకూలము చేసినమనకు గొప్పబహుమతులిచ్చి మనఉసురుండేవఱకు కాపాడును అయనను మోసముచేస్తే మనప్రాణాలతో విడిచిపెట్టడు; ఇంకమీధర్మశాస్త్రములనుకట్టిపెట్టి పూజాద్రవ్యములను గొనివచ్చు నిమ్మనుజునిఖండించెదము; లెండు?

వీరన్న:—ఒరే నాగన్న? నీకెంతకఠినగుండెరా! నిలువునాప్రాణము దీయసీమనస్సెట్లొప్పెనురా? నీబోటివారినే నెక్కడచూడలేదురా! హత్యచేయుట గొప్పపాపమని శాస్త్రములుచెప్పుటను నీవు ఎపుడునువినలేదా! వినియుండినను నీవు కఠినహృదయుండవు ఈపనియని తెలిసియుంటే నేనురానేరాను.



నాగన్న:—యీరన్నా ? నీనీతులు ఈకాలానికి పనికిరావోయి; సద్యోకాల ఫలితమేగదా చూడవలసినది.

వీరన్న:—ఇట్టిహత్యలను జేసినవారిని యమదూతలు శూలములచేగ్రుచ్చి గదలచేమొత్తి అంధతామిస్ర అంధకూపరౌరవాది నరకంబులద్రోచి పెనుబాధలం బెట్టుదురు కానమీరలు ద్రవ్యంబునకు నాశించి పరమచండాలుడును అసూయాపరుండును వంచకుడును క్రూరచిత్తుండునైన యాదుష్టబుద్ధి బహుమానంబుల కాశపడి యిట్టిదుష్కార్యంబు చేయందలంచు కొంటిరి;

మదన:—ఆహా! యిదియేమి! దేవాలయంబును సమీపింప సమీపింప నాహృదయంబులో పెనుమంటలు పెట్టినట్లున్నదే! కాళ్ళుతడబడుచున్నదే! నాలుకయెండిపోవుచు కనులుబయళ్ళు క్రమ్మియేమియూ దోచకున్నది; ఈదేవాలయంబులో నెవరోమాట్లాడుచుండి నారాకకనుంగొని చప్పుడుచేయక దాగుకొనియున్నట్లు గన్పట్టుచున్నది; ఇదియంతయును గాంచనాకేదోగొప్ప కీడుమూడునోయని నామనంబు తల్లడపడుచున్నది.

వీరన్న:—అరేనాగన్నా! యీచిన్నకుఱ్ఱని పలుకులువిను; మనమదనయ్యగా నున్నాడు; ఇతను వేరని తోచలేదు.

నాగన్నా:—ఎవరైతేనేమి; మనపనిమనము చూతాము:

(వధింతురు)

వీరన్న:—ఒరే దుర్మార్గులారా! అనుకొన్నంతచేసితిరే; ఈకుఱ్ఱనింజూడుడు; నిజముగా నితడెవడోచూడుడు:

నాగన్న:—ఆహా! యెంతమోసపోతిమి; యదార్థముగా నితడుదుష్టబుద్ధికుమారుడే! ఇతడిందులకురాఁగతంబేమి? ఇతనిని మృత్యువెంతదూరంబునకు గొనివచ్చె; అవసరపడితిమి; ఇంకమనమిచ్చట గూర్చుండి విలపించుచుంటిమేని చచ్చినవాడుబ్రతుకునా! ఎవరైనచూచినయెడల మనప్రాణములకేహానివచ్చును; ఈతప్పంతయుదుష్టబుద్ధిదేకాని మనదికాదు; రండుపోదము:

(అనినిష్క్రమింతురు)

---

## తృతీయరంగము.

### దుష్టబుద్ధిమేడ.

దుష్ట:—ఏమికాలమహిమ? ఎంతసేపు పరుండినను నిద్రపట్టకయున్నదే! పైత్యాధికము వలనగా? అయ్యోనాకింత పైత్యమెక్కడనుండి యింతత్వరగావచ్చినది. ఎడమకన్ను భుజము అదరుచున్నదే! కడుపునఅగ్ని పెట్టినట్టున్నదే! నా మనసునకేమి తోచకయూం దోళనము చేయుచున్నదే! నేనేమిచేయుదును; అయ్యో! నాప్రియపుత్రుడగు మదనుడుగూడ సమీపమునలేడే; ఇట్టి మనోవ్యాకులంబు నేనెన్నడైన ననుభవించియుందునా? జగదీశా



యిట్టికష్టంబునకు బాల్పడునట్లు చేయనెంచితివో? సేవకా! అదియేమిశబ్దము ఈరాత్రి వేళలో మేళతాళ శబ్దములు వాయింపగారణంబేమి? నీవు పరుగిడిపోయి చక్కగా దెలిసికొనిరమ్ము:

సేవకుడు:—ఆర్యా! యూరేగింపు.

దుష్ట:—ఎవరికి;

సేవ:—ఎవరికా! చంద్రహాసునికి చంపకమాలికిని;

దుష్ట:—ఏరా! నోటికివచ్చి నట్లెల్ల వదరుచున్నావు. నిజముగానా; మూర్ఖా!

సేవకు:—దేవా! రాజుగారునిన్నటిరేయి యేదోయొక కలగనెనట; అందుపై చంద్రహాసుని బిలిపించి, కుమార్తె నిచ్చి పెండ్లిచేసి; రాజ్యమంతయు నతని స్వాధీనము చేసినారు; ఇపుడావధూవరు లిద్దరికి ఊరేగింపు మహోత్సవము.

దుష్ట:—(తనలో) ఔగా! ఎంతటి మోసమాయెను? (ప్రకాశముగా) సేవకా! ఊరేగింపు ఏదిక్కుగా వచ్చుచున్నది; గొప్పయూరేగింపేనా?

సేవ:—ఔనౌను: తమదర్శనార్థమై వచ్చునట్లున్నది.

చంద్రహాస ప్రవేశము; చంద్రహాసుడు నమస్కరించును:

దుష్ట:—చంద్రహాసా! నీకుసకల శుభంబులు కలుగుగాత; నీవు కాళికాలయంబునకేల నరుగవైతివి.

చంద్ర:—మాతులా! నేను అంబనుదర్శించ నేగుతతటి నీపుత్రుడగు మదనుడునన్ను రాజువారి యొద్దకుబంపి నాకుబదులు తానుదాతెూయణి దర్శనార్థమేగెను.

దుష్ట:—(తనలో)ఔరా! యెంతటి మోసమాయెనునాపుత్రుని గతియేమయ్యెనో.



## చతుర్థరంగము.

దుష్టబుద్ధి కాళికాలయమున కేగుట.

నాదనామక్రియ - ఆదితాళము.

దుష్ట:—

ఎందునను న్నాడో నాసుతు॥ ఎందున॥
మందిరమందున మదనుడు లేదాయె
ఎందెందు వెదకిన నిపుడిటు గానరాక॥ ఎందున॥
నందనవనమున నగరున లేడే
డెందముగొందల మందగ జేసిటు॥ ఎందున॥
శీలగుణాఢ్యుని నేలీలగాంతును
తాళగజాలను తనయునిఁగానక॥ ఎందున॥

ఆహా:—మదనా! ఎందున్న వాడవు; నేనన్ని చోట్లను వెదకితిని: ఎందున గానరాడయ్యెను; ఇక నేను గాళికాలయంబున కేగిచూచెద:



ఆహా:—యిచట నేదో మొండెముగను బడుచున్నదే; ఇదెవని మొండెమో; (అనిదగ్గరబోయి) అయ్యో! తలలేదే ఇదేమి యన్యాయము ఇందు తలబడి యున్నదే! ఇది ఎవరి తలనై యుండును? (చేతికెత్తుకొని)

బాలకనీకిటు కాలముతీరెన-ఏలాగుతాళుదురాపుత్రా॥ బాల॥
ఆలయమునకునీ- వేలవచ్చితివయ్యా-కాలమృత్యువునిన్నుకడ
తేర్చెనాసుతా॥ బాల॥
ఏకపుత్రుడవని-ఎంచినేజేసిన- యుక్తులునాకిపుడిక్కట్ల దెచ్చెనయ్యో॥ ధారుణియందునా- తనువునిల్పగలేను- మరణించెద
నిపుడేమన జాలభువియందు॥ బాల॥

అయ్యో! యిది మదనునితలయే దైవమా! యెంతటియన్యాయమాయెను; నేనొకటితలువ దైవమొకటి జేసెను;హాపుత్రా! నీకై నేజేసినయుక్తులన్నియు నిరర్థకంబులై తుదకీప్రాణానికేవచ్చెనే;ఆహా! శ్రీమహావిష్ణుభక్తులకుఁ గీడుతలంచు ద్రోహులకు యుక్తులు ఫలించునా? ఒక్కనాటికిని ఫలింపవు;మదనా! నీకై యెన్ని పాట్లు పడితివిరా! నిన్నుకుంతల దేశమునకు రాజునుగా జేసి కన్నులార గాంచి సంతసింపవలయునని యుండినవి యన్నియు నీకిష్టములేక యీచండికకు బలియైతివా? పుత్రా!

ఉ॥ ఎంతయుమెంచితౌరసుత-యెన్నగనన్నియునాశయుంచరక్ష
పంతముతోడ బాపనటు - పంపియునీవిట్రుమందినావుగా
హంతకుడారయీాపనిని- నెంతయుమానసమందునెంచరక్ష
వింతగనీదుప్రాణములు - వేగమెతీసిరియేమనందురా॥

బాలకా!

ఉ॥ ఏనెటులోర్తునింకనిను - నేమనువాఁడనునాదుకర్మముల్
బ్రాణముపోవజేసెనిను - పాపిని నేనిక భూమియందునన్
సూనుడనన్ను బాసియెటు - శూరులువోయెడి త్రోవబోతివో
మానముపోయెనాకెవరు - బ్రమందెదనిందునసుందరాసుతా॥

ఉ॥ ఏమని తెల్పువాఁడసుత - యేదియుదోచదు - ఎంచిచూడగా
నామదిచింతలోమునిగె - నాగతియేమిక హాసుతాయిటన్
ఏమియునాకుజెప్పకను - నీవిటుబ్రమందగనీదుతల్లికిన్
ఏమని చెప్పువాడనిపు - డేటికివచ్చితివో ప్రియాసుతా॥

హాపుత్రా! నాకలజడిపెట్టి నీవుపరలోకంబున కేగితివే! నీచ పనికి నేనేమని తెల్పుదును; నీమరణంబున నీకన్నతల్లి విన్న నెన్న రాని దుఃఖంబనుభవించునే నన్నుతాంగా! నీకెన్నివిధంబున మేలుచేయదలచుకొని యెన్నెన్నోయుక్తులం బన్నితినే; యవి యన్నియు నిరర్థకంబులై తుదకు నిన్నుగోల్పోయితిని; ఇంక నేనీ భూమియందు జీవించియుండి యేమి ప్రయోజనము: ఇంకనా ప్రాణంబుల నీకాళికాలయంబున విడిచెద:

(అనుచు దుఃఖముతో శిరంబును స్తంభముపై మోదుకొని

(ప్రాణములు వదలును)

సేవ:—ఆహా! యేమి యాశ్చర్యము ఈ కాళికాలయంబున నెచ్చటచూచినను రక్తమయమై యున్నదే; యిటులుండ గారణమేమి (అని లోపలికిబోయి) అయ్యో! దుష్ట బుద్ధియుమదనుడును చచ్చియున్నారే? వీరికిట్టివిపత్తు సంభవింప నేల? నిన్నటిదినమిరువురు నానందముగా నుండిరే?



ఇకనీవర్తమానము నతిశీఘ్రముగా ప్రభువైన చంద్రహాసున కెఱింగించెద.

చంద్ర:—సేవకా? ఏలనీవిటుల బఱువెత్తి వచ్చితివి?

సేవ:—మహాప్రభో? ఏమని చెప్పుదును; ఎంతటియాపద? మీ మామగారికిని బావగారికిని సంభవించిన యాపదజెప్పుటకు నోరాడకున్నది.

చంద్ర:—యేమిరా! అట్టియాపద - విశదముగాదెలుపుము.

సేవ:—ఆర్యా! మీమామగారును బావమఱిదికి మనయూరికి వెలుపలనుండు కాళికాలయంబున జంపబడియున్నవారు.

చంద్ర:—ఆహా! అదినిక్కమా? సేవకా అతిరయమ్మున విషయను బిలిపింపుము:

విషయ:—హా ప్రాణనాథా! నేనేమిచేయుదు; నావారికెంతటి విపత్తుసంభవించినది. ప్రాణేశా? దుష్టులెవరో వారిని కడతేర్చిరి; ఇంక నేనెవరిని తండ్రీ! అన్నాయని పిలుతును. అయ్యో! నాప్రాణములు పోకయున్నవే:

చంద్ర:—ప్రియే! నీవిటులవ్యసనపడి వారిని బ్రతికించగలవా? అవశ్యమనుభోక్తవ్యం కృతంకర్మ శుభాశుభమ్; అనునట్లు వారువారు చేసికొన్నది యనుభవింపక తీఱదు; గతించిన వారికై వెతలనొందనేల? నీకిటుల వెతనొందుటనుగాంచిన నామనం బపరిమితదుఃఖమును బొందుచున్నది.

ప్రియసఖి:—ఆలస్యముచేయుక చండికాలయంబునకు పోదము రమ్ము.

---

## చండికాలయము.

చంద్ర:—(మదనప్రేతమునుజూచి)

### ఎఱుకాంభోజి - చాపుతాళం.

మదనా నీవిటు మడియుటకై యిట - పదపడివచ్చితో బాంధ
వ యేమందు॥ మద॥
పాతకమెంచక - ఘాతకులెవ్వరో జనిసీతిమాలి నిన్ను - నిట
జేసిరయ్యయ్యో॥ మద॥
ధారుణీపతికడకు - త్వరగా బంచినను - నీరీతిమరణింప-నిందుల
కొచ్చితో॥ మద॥
ఏరీతినినుబాసి - యిలనుండనోర్తురా - కాలమృత్యువునకు గడ
వతరమే మిత్రా॥ మద॥

హా మదనా:—నీకెంతటివిపత్తు సంప్రాప్తించెను.

క॥ హా రాజసన్నిభాసన
హా రాజకుమారధీర - హా సుకుమారా
హా రవిసన్నిభ తేజా
హా రమణీయాంగ - మిత్ర హా హా మదనా॥

(దుష్టబుద్ధినింజూచి)



మాతులా మముబాసి నీవిటుల నుదివికేగితే॥ మా॥
క్రూరులు నిన్నిటు ఘోరవధ చేయు - నేరమదేమి యొక్కొ॥ మా॥
ఖ్యాతిని గాంచిన - ఘనుడవు నీవిటు - కాలగతినొందితో॥ మా॥
నీవంటి యాప్తుని - నిలలోన నేగాన - నినుబాసి నేనుందునా॥ మా॥

కం॥ తపముల విద్యలబుద్ధిని
జపములమంత్రౌషధముల - సత్క్రియలమహా
నిపుణతల నెంతవారికి
విపులంబగు మృత్యుభయము - విడచునె మామా॥

ఆ-వె॥ మేనినీడపగిది - మృత్యువు వర్తింప
జనులకెట్లు సుఖము - సంభవించు
వ్యాఘ్రమెదుటనుండ - వనమృగంబులకును
హర్షమగునె మేత - లారగింప॥

విషయ:—జనకా! మమ్ములనందఱిని దిగనాడి నీవుమాత్రమే
గుట ధర్మమా? మాకర్మమా? యెన్నిమాఱులుపిలిచి
నను మాటలాడవు అయ్యో! నేనేమిచేయుదు; హా! జగ
దీశా! ఎంతటి యాపద నావారికి సంభవింప జేసితివి:

అన్నా! మదనా! నాకై నీవెంత శ్రమపడి సుకుమార సుంద
రునకిచ్చి వివాహంబుచేసి యనవరతము నాపయిం బ్రే
ముడిం జూపుచు నన్నిటుల నొంటరిగా విడిచి నీకేగుట
యుచితమే; నేనింకెవరిని అన్నాయని పిలుతును:

చంద్ర.—సఖీ! ఏలయిటుల వెఱ్ఱిదానివలె వ్యసనంబుఁ గొనుచు
న్నావు నిక్కముగా:

క॥ గురుసంసార భ్రమణుల
కరుదేతమపూర్వ జన్మకర్మానుభవం
బిరవొందు సురలకైనను
నరులనగా నెంతవారు - నలినదళాక్షీ॥

కం॥ కొందఱు కాలంబనుచును
గొందఱు కర్మంబటంచుగుణములటంచున్
గొందఱు పంచాత్మకమని
యందురు తనుకారణములఁ హరినిభమధ్యా॥

ప్రియే! సజ్జనులగు వారలు;

గీ॥ జననమయ్యెననుచు సంతోషమందరు
మృతమునెందెననుచు - వెతలఁబడరు
ధీరులైనవారు - దేహంబువీక్షించి
భ్రాంతినొందరెపుడు - పద్మనేత్రీ॥

కం॥ అవ్యక్తమున జనించును
నవ్యక్తము నందయణగు నామధ్యమునన్
సువ్యక్తముగా వెలయును
భవ్యమతీతనువునిమిష భంగురమరయన్ ॥

క॥ ఎప్పుడుగర్భగతుండగు
నప్పుడయా దేహినాశ మందుటసిద్ధం



బొప్పగవిధివశగతినగు
నుప్పతిలుటచచ్చుటయు మహోత్పలగంధీ॥

ప్రియే! జనులనేకవిధంబులుగామరణంబుఁ బ్రాప్తించును, అవి
వారివారికర్మననుసరించియుండును.

ఉ॥ కొందఱుగర్భదేశములఁ - గొందఱుసంభవమైనమాత్రనే
కొందఱుయవ్వనంబునను- గొందఱువార్ధకతారసన్ లయం
బొదుదు రెల్ల జంతువులు- నాత్మభవాంతర కర్మరీతులం
జెందిసుఖాసుఖంబులు- ప్రసిద్ధముగాభుజియింతురందఱున్.

ప్రియే! యీ దేహమెటులఁగలుగునన ?

క॥ పితృమాతృసురతసమయో
ద్గత తేజోరక్తమిశ్రితాజనితంబై
వితతంబై తనువలరును
సతియనగాఁబురుషుఁడనగ - షండుండనగన్॥

సఖి:—సుఖదుఃఖముల విధంబుచూ చెదమన.

గీ॥ సుకృతదుష్కృతములు - సుఖదుఃఖములుమహా
విద్యలర్థములును - విభవములును
ఆయువునుశుభంబు - లజుడు వ్రాసినయట్ల
యనుభవింపుచుందు - రఖిలజనులు॥

క॥ అనతిక్రమమగుకర్మము
ఘనతరకాలంబుగడువ - గారాదుభువిన్

దనువులు శాశ్వతములుగా
వనయముశోకింపఁదగునె - యబలానీరుక్॥

ప్రాణనాయకీ! ఈనరజన్మము శాశ్వతమైనదా?

గీ॥ నిక్కమనరుజనులు - నెలతస్వప్నంబులు
సత్యమగునె - యింద్రజాలవిద్య
యీకళేబరంబు - లెన్నిభంగులనైన
శాశ్వతంబుతానె - చంచలాక్షి॥

సఖి! మృత్యువునుండి తప్పించుకొనుటకు నెవ్వరికి సాధ్యం బుకాదు, ఇట్టియస్థిరమైన యీపాడుజన్మమునకు నెన్నిపుట్టువు లున్నవోయెవరికిదెలియును. చింతిల్లకుము.

సీ॥ నీకుజన్మంబులు - నేకంబులైయుండు
నిప్పుడువ్యామోహ - మెట్లుకలిగె
నెక్కడిజనకుడు? ఎక్కడిజననియు
నెక్కడినందనుం - డెంచిచూడ
నెక్కడివల్లభుం - డెక్కడిప్రియురాలు
దైవమాయకల్పి - తములుకాక
నిజదేహజమలంబు - నీక్షించిసుతుడంచు
గించిజ్ఞవగుచుశో - కింపఁదగునె



గీ॥ రక్తమాంసపురీషమూ - త్రాస్తినిచయ
పూయమేదోవసాశుక్ల - హేయమగుచు
నస్వతంత్రంబశాశ్వతం - బైనయట్టి
తనువుపైకాంక్షసేయుట - ధర్మమగునె॥

ప్రాణనాయకీ! చింతింపకుము: ఇపుడే నేనుదుర్గకెదుటహోమగుండంబు గావించి మంత్రపూర్వకంబుగానం బనర్చించి ప్రార్థించెద.

ఎల్లలోకములకు దల్లియగు గిరిపుత్రికకు నవ్యసనంబుల దొలగద్రోచిమనల గాపాడగలదు ఊరడిల్లుము.

[హోమగుండము నిర్మించి అంబను స్తుతించును.

జగదంబికా? నేనుపామరుండను నిన్నుస్తుతించుటకు శక్తిలేనివాడను తల్లీ? నాపైఁగరుణించి నావారిని బ్రతికింపుము.

ఉ॥ క్రొన్నెలపువ్వునుర్ నిలుప - గుంకుమరేఖయుఁబద్మనేత్ర
ముల్,పన్నగహారముల్విమలభర్మమణీస్ఫుటకుండలమ్ములుర్
వన్నెఁజెలంగనెప్పుడు భవద్విమలాకృతిఁజూడఁగోరునా
కన్నులుభ్రూలతావిజిత కామశరాసన! త్ర్యంబకేశ్వరీ॥

ఉ॥ పార్వతి!సర్గృపారతినిఁ జాలనచేయవదేలనమ్మ?యో
శర్వసతీ? మదీయనుతిఁ జక్కగగైకొన వేలనమ్మ! యె

ట్లోర్వగవచ్చునమ్మయిఁక - నోయుమకన్నడ వేలనమ్మ! నీ
సర్వచరిత్ర లేనెరుఁగజాలుదునమ్మరో? త్ర్యంబకేశ్వరీ॥

ఉ॥ నాకభయమ్ములిమ్మశివ - నాకుశుభమ్ములొసంగుశాంకరీ
నాకువరమ్ములిమ్మసతి - నాకుప్రియమ్ముల జేయుశాంభవీ
నాకుహితమ్మొనర్పుముమ - నాకికఁగన్పడునోభవానినీ
ప్రాకటమైనసత్కృపకుఁ - బాత్రులమైతిమిత్ర్యంబకేశ్వరీ॥

కవిరాజవిరాజితము.

జయజయపార్వతి శంబుకుటుంబనిచారునితంబిని కంబుగళే
జయజయవిద్రుమ బింబఫలాధరి చక్రిసహోదరి పీనకుచే
జయజయశాంకరి సాధువశంకరిశత్రుభయంకరి మానినుతే
జయజయశుంభనిశుంభవిషూదని సత్యవినోదినిశాంతిరతే॥
తల్లీ! నీవునాకుఁబ్రత్యక్షంబుకాకపోతివేనినాకరంబున నున్న
ఖడ్గంబుతో నాశిరంబు ఖండించుకొనియెదను.

(అనినఱుకుకొనబోవును.)

కాళికాదేవి (ప్రత్యక్షమై)వత్సా! చంద్రహాసా ! యవ
సరపడకుమునీభక్తికిమెచ్చితిని.

చంద్రహాసుడు:— [లేచినిలువంబడినమస్కారంబొనర్చి,]



దండకము.

శ్రీమన్మహాదేవురాణీ । నతేంద్రాణి । రుద్రాణి । శర్వాణి కల్యాణి । దాక్షాయణీ।శూలపాణీ । పృథుశ్రోణీ। ధూమ్రాక్షసంహారిణీ। పారిజాత ప్రసూనాంచితస్నిగ్ధవేణీ । లసత్కీరవాణీ। భవానీ । శివాశాంకరీ। రాజరాజేశ్వరీ గౌరి । శాకంబరీ । కాళి । కంకాళి । రాజీవనేత్రా । సుచారిత్ర ।కల్యాణగాత్రీ ।మహాదైత్యజైత్రీ। నగాధీశపుత్రీ । జగన్మాత । లోకైక ।విఖ్యాత ।గంధర్వ ।విద్యాధరా। దిత్యకోటీరకోటీ । స్ఫురద్దివ్య । మాణిక్య । దీపప్రభాత్యుల్ల ।సత్పాదకంజాత । కేయూర ।హారాంగ । దాదిజ్వల । ద్భూషణ । వ్రాత । కౌమారి।మాహేశ్వరీ నారసింహీ । రమా । వైష్ణవి । శాంభవీ । భారతీ । భైరవీ । దుర్గ । కాత్యాయనీ । పార్వతీ । నీదుసామర్థ్య మెన్నంగ ।బ్రహ్మాదులుం । శేషభాషాదులుం ।జాలరే నంతవారంక । భ్రశంసింప। నేతజ్జగజ్జాల । నిర్మాణసంరక్షణా । రంభ ।సంరంభ। కేళీ । వినోదంబులుం । గల్గి వర్తింతు । రెల్లప్పుడో । యాదిశక్తి।పరంజ్యోతి। నారాయణీ । భద్రకాళీ ! శుకశ్యామలా ।భ్రామరీ। చండిక । లక్ష్మి।విశ్వేశ్వరీ । శాశ్వతైశ్వర్య।సంధాయినీ। యంచు నిన్నెంతయుం।సన్నుతుల్ చేయు । లోకాళికిం । సంత

తాఖండ। దీర్ఘాయురారోగ్య। సౌభాగ్య। సంసిద్ధిఁగా
వింతు। వశ్రాంతముర్। రక్తబీజాదిదైతేయులఁ।క్రుంచి
బృందారక। శ్రేణిరక్షింతు। నీవెప్పుడున్। నారదా
గస్త్య। శాండిల్య। మాండవ్య। మైత్రేయ। జాబాలి।
కణ్వాది। మౌనీంద్రు। లత్యంత। నిష్ఠా। గరిష్ఠాత్ములై।
హృత్సరోజంబులన్। ధ్యానముల్। చేయుచున్। బూజ
గావింతురం। తర్ముఖత్వంబు। నంజంద్ర। ఖండావతం
సా। భవద్దివ్య। రూపంబు। బ్రహ్మాండ। భాండంబు।
లన్నిండి। వెగ్గొందు। నేతత్ప్రపంచంబు। సర్వంబు।
నీవై। ప్రవర్తింతువీ। సూర్యచంద్రాదులున్। భూజలా
కాశవా। తాగ్ని జీవాత్ములున్నవ। నీకంటె। వేఱైన।
చిహ్నైనయున్। లేదు। యుష్మత్కటా। క్షార్హులై। నట్టి
వారల్గఁదన్। ధన్యులై। మాన్యులై। పుణ్యులై గణ్యులై
యుందురే। ధాత్రిలో। నేను మూఢుండ। గర్భాధిరూ
ఢుండ।దుశ్చిత్తుండన్ మత్తుడన్।జ్ఞానహీనుండ।దీనుండ।నేఁజే
యు। నేరంబులంగాచి రక్షింప। నీభారమో। తల్లి।
సద్భక్త। మందార। వల్లీ। నమస్తే। శరచ్చంద్ర। బిం
బాన। నాయై। నమస్తే। శశాంకారుణ। ప్రజ్వల।
త్కుండలా। యైనమస్తే। పరిత్రాతభూమండలా। యై
నమస్తే। విపధ్వాంతభానుప్రభా। యైనమస్తే। పరిధ్వస్త
తాపత్రయా। యైనమః। కామదా। యైనమో। ధర్మ
దాయైనమో। భాగ్యదాయైనమో। శర్మదాయైనమో।



ముక్తిదాయైనమో। శ్చండికాయైనమో। స్తంబికాయై
నమో। శ్రీనమః పార్వతీ నమస్తే నమస్తేనమః.

కాళికాదేవి.

కం॥ ఏమిటికై ప్రార్థించితి
వేమిభవత్కామితంబు లెఱిగింపుమునీ
కామోదంబుగ నొసగెద
నామాటనిజంబుగాగ నమ్ముముభక్తా॥

భక్తాగ్రేసరా! నీకుగావలసిన వరంబు లేదో యడిగికొమ్ము.

చంద్ర.—

తల్లీ! దయామతల్లీ దుర్మరణంబు చెందిన నామాతులుం
డును బావమఱదియుఁ బునర్జీవితు లగుదురుగాక అంత
కన్న వేఱువరంబేది?

కాళికాదేవి.—

అట్లులనయనుగ్రహించితి.

[దుష్టబుద్ధి మదనుడు లేతురు.

మంగళ మహాశ్రీ.

మంగళము కృష్ణునకు మంగళము జిష్ణునకు
మంగళము విష్ణునకు

(మంగళంబాలన్

మంగళము ధీరునకు మంగళముసూరునకు
మంగళంమారునకు
(మంగళంబౌర్
మంగళము శ్రోతలకు మంగళము జేతలకు
మంగళము సేతులకు
(మంగళంబౌర్
మంగళము లందరికి మంగళము లాటలకు
మంగళము పాత్రలకు
(మంగళంబౌర్

చంద్రహాసచరిత్రము.

సంపూర్ణము.



